ప్రథమ ముద్రణ : విక్రమనామసంవత్సర శ్రావణమాసము
4-8-2000

ద్వితీయ ముద్రణ : వికారి నామ సంవత్సరం 2019

ప్రతులు : 1000

**ప్రతులకు :** **శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ**

**భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్**

**అశోక్‌నగర్ 4వ లైను,**

**గుంటూరు-6.**

**ఫోన్ : 0863-232935**

ముద్రణ : **శ్రీ లక్ష్మీ గణపతి ఆర్ట్ ప్రింటర్స్**

2/4 బ్రాడీపేట, గుంటూరు-2.

ఫోన్ : 0863-2235036.

శ్రీమహాగణాధిపతయే నమః



# ముందుమాట

**వరదాభయపుస్తకాక్షమాలావిలసత్పాణిసరోజభాసమానామ్ ॥**
**శరదిందుసహస్రకోటిరూపాం పరమానందమయీం ప్రణమామి బాలామ్ ॥**

గుంటూరు అశోకనగరులో జరుగుతున్నరామాయణప్రసంగాలు, చండీయాగాలప్రారంభోత్సవానికి పూజ్యులు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారితోపాటు ప్రప్రథమంగా శ్రీబొల్లేపల్లి సత్యనారాయణగారింటికి వెళ్ళాను. అదే వారిని చూడడం. అతిథులకు వారిచ్చేసాదరఆహ్వానం, కార్యక్రమనిర్వహణ, వచ్చినప్రతిశ్రోతకు రకరకాలఫలా లివ్వటం, పెద్దలను గౌరవించటం నాకు ఎంతగానో నచ్చింది.

తరువాత శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారితో వారింటికి వెళ్ళేను. నన్ను వారికి పరిచయం చేశారు. ఆపరిచయం బాగా బలపడింది. తరువాత వారు చేసినయజ్ఞాలకు, క్రతువులకు, దీర్ఘసత్రయాగాలకు, అయుతచండీ యాగాలకు ప్రతిష్ఠలకు, వేములవాడ, శ్రీశైలంలాంటిపుణ్యక్షేత్రాలకు వెళ్ళడమే కాక, వారిపుస్తకాలు ముద్రణ చేయడం కూడా జరిగింది.

నాపరిచయానికి పూర్వమే వారు కృష్ణాపుష్కరాలసందర్భంగా క్రతువులు, ఆంధ్రప్రదేశ్ సాధుపరిషత్తులు, సదస్సులు అనేకయజ్ఞాయాగాదిక్రతువులు జరిపారు. శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ, లలితాంబదంపతులు ఇలా చెయ్యడం వారి ఎన్నో జన్మలతపఃఫలం. ఇంతటిత్యాగం, ఔదార్యం ఉండడం అసామాన్య విషయం.

తరువాత వీరింటికి శ్రీనృసింహానందభారతీస్వామివారు రావడం, వీరి యోగ్యతకు సంతోషపడి ముందు శ్రీమతి లలితాంబగారికి మంత్రోపదేశం చేసి దీక్ష నివ్వడం, తరువాత సత్యనారాయణగారికి దీక్ష ఇవ్వడం, సప్తశతీపారాయణ చేయించడం సాధారణవిషయం కాదు. తరువాత వీరు సామూహికసప్తశతి, లలితా, విష్ణుసహస్రనామపారాయణలు, గణపతి, రుద్ర, చండీయాగాలు, వివిధ దేవాలయాలలో శ్రీ రాయపాటి సాంబశివరావుగారిసహాయంతో అమ్మవార్లకు, అయ్యవార్లకు మండపాలనిర్మాణాలు, ప్రతిష్ఠలు చేయించారు.

ఈకార్యక్రమా లన్ని ఒకసంస్థద్వారా జరిగితే బాగుంటుం దన్న సదభిప్రాయంతో శ్రీశ్రీశ్రీ నృసింహానందభారతీస్వామివారిఆశీస్సులతో వారి స్వహస్తాలతో **శ్రీభారతీధార్మికవిజ్ఞానపరిషత్** ఆవిర్భవించింది.

పరిషత్ ధ్యేయాలలో యజ్ఞయాగాదిక్రతువులే కాక, గ్రంథముద్రణ కూడా ముఖ్యం. వీటివల్ల ప్రజల్లో భక్తిభావం, సద్బుద్ధి, మంచినడవడి కలుగుతాయి. అవి పెంపొందించటానికి ఈపరిషత్తు పుస్తకముద్రణను చేపట్టింది. అవి స్తోత్ర కదంబాలు, మహాగణపతితత్త్వవైభవము, శివార్చనం, ఆదిత్యవైభవం, రామాయణ, మహాభారత, భాగవత ఉపన్యాసాలు, శివారాధన మొదలైనవి. ఇంకా ముంద్రించవలసినవి శ్రీసుబ్రహ్మణ్యతత్త్వవైభవము, మొ. ఈసంస్థ ప్రచురించిన పుస్తకాలవైఖరి చూస్తే పంచాయతనతత్త్వాన్ని ఆవిష్కరింపజేసిన ట్లనిపిస్తుంది. ఏపుస్తకం వేసినా, కోటిలో ఒకటిగా కాకుండా, ఒకప్రత్యేకత ఉండా లని వీరి ఆశయం. ఆదేవతను గూర్చి వీలయినంత ఎక్కువ విషయం అందించటానికి ప్రయత్నం చేస్తారు. పూర్తి వివరాలతో విశ్లేషణతో అర్థ మయ్యేరీతిలో పాఠకుడికి ఉపయోగపడేట్లుగా ఉండటమే వీటివిశేషం.

శ్రీమతి లలితాంబగారు వివిధశక్తిపీఠాలలో యజ్ఞయాగాదిక్రతువులు చేయించినప్పుడు పొందినఅనుభూతి, ఏకభుక్తంతో నిత్యచండీపారాయణ చేయటం, నిరంతరం అమ్మవారిని ధ్యానం చేస్తూఉండటంవలన శ్రీచండీసప్తశతిని ప్రచురిస్తే బాగుంటుం దన్నసంకల్పం కలిగింది. అప్పుడు శ్రీసత్యనారాయణగారికి సూచిస్తే సరే నన్నారు. సంస్థస్థాపనోద్దేశాలలో విశ్వశాంతికి లక్షచండీపారాయణ కూడా ఒకటి. ఇప్పటికి 50వేలపారాయణలు చేయించటం జరిగింది. ఈపుస్తకం ప్రచురణ

చేసి, అందరికీ పారాయణ చేసుకొనేఅవకాశం యథాశక్తి కల్పించా లని వీరిఆశయం.

1998లో శ్రీసత్యనారాయణగారింట్లో గణపతి, రుద్ర, చండీయాగాలు, చండీసప్తశతి, లలిత, విష్ణుసహస్రనామపారాయణలు జరిగాయి. పూర్ణాహుతినాడు శ్రీసత్యనారాయణదంపతులు అమ్మవారి ముం దుంచినహుండీలోని ద్రవ్యం నా కిప్పించి పుస్తకప్రచురణకు శ్రీకారం చుట్టారు.

పండితులను, పారాయణ చేసేవారిని సంప్రదించి వారివారిపద్ధతులను, గురుపరంపరలను, సంప్రదాయాలలోనితేడాలను వివిధసప్తశతీప్రతులను పరిశీలించి, చాలా మందిని విచారించి, ఈగ్రంథానికి రూపం తేవడం జరిగింది. పైపరిశీలనలోని కొన్నివిషయాలను విపుల మైన 60 పేజీలపీఠికలో గమనించ వచ్చు. ఇందులో సప్తశతి అని ఎందు కన్నారు? ఎన్నిరకాలసంప్రదాయా లున్నాయి? వాటిలోనిభేదాలు? సప్తశతిపారాయణ ఎంతెంతకాలంలో ఎలా చెయ్యాలి? దీనిని ఐహికఆముష్మికాలకు ఎలా వినియోగించుకోవాలి? మొద లైనఅంశాలు వివరింపబడ్డాయి. వివిధసంప్రదాయాలవారు పారాయణ చేసుకునే వీలుగా ఈదేవీమాహాత్మ్యాన్ని (చండీసప్తశతి) రూపొందించడం జరిగింది. ఈగ్రంథాన్ని ఇలా రూపొందించినవ్యక్తికి వారిపేరు తెలపడం ఇష్టం లేదు. వారికి కృతజ్ఞతలు.

ఒకమహాయజ్ఞంగా ఈపుస్తకప్రచురణ సాగింది. శ్రీసత్యనారాయణగారు ఎంతో శ్రమ కోర్చి మీ కందిస్తున్నారు. ఇలాంటిగ్రంథాన్ని బీరువాలో పెట్టి మా యింట్లో సప్తశతి ఉన్న దని ప్రక్కవాళ్ళతో చెప్పుకోవటానికి కాకుండా, గురువుద్వారా ఉపదేశం పొంది, యథోచితంగా పారాయణ చేస్తే, ఈయజ్ఞంలో మీరూ భాగస్వాము లయి, భగవతిదయకు పాత్రు లవుతారు.

ఈఅవకాశం నాకు కల్పించినసత్యనారాయణగారికి కృతజ్ఞతలు, అమ్మవారికి సాష్టాంగదండప్రణామములు.

బుధజనవిధేయుడు

**బిదురు వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి**

లక్ష్మీగణపతి ఆర్ట్ ప్రింటర్స్

2/4, బ్రాడీపేట, గుంటూరు - 2

ఫోన్ : 235036

# సహృదయమోదము

**అనంతకోటిబ్రహ్మాండజననీపదపంకజమ్,**
**నమామి య న్నతే ర్నశ్యేత్ భయం సంసారపంకజమ్ ॥**

ఆస్తికమహాశయులారా ! **"కోటిజన్మార్జితైః పుణ్యైః దైవే భక్తిః ప్రజాయతే"** అని అభియుక్తోక్తి. దైవభక్తి ఉన్నంతమాత్రమున ముక్తికి యోగ్యత కల్గినట్లు భావించరాదు. **"జ్ఞానా దేవ హి కైవల్యమ్"** అన్నసూక్తి నవగాహన మొనర్చుకొని. **"స్వయం తీర్ణః పరాన్ తారయతి"** అనుభావనాబలముతో పురోగమించి, యాచరణమునందు నొజ్జబంతిగా మెలగిననాడే జన్మమునకు సార్థకత సంపాదించినట్లుగా నెంచవలెను. ఆదృష్టితో నిష్కామ భావపరివృతమనఃపరిణతి నొందినవారు నూట వేయింట నొక్క రుందు రనుట అతిశయోక్తి కాదు. స్వార్థరహితసేవ, పరమార్థసాధనైకసద్భావము కలుగుట పూర్వజన్మ సుకృతవైభవ మని సర్వాంగీకృతనిశ్చయము, నిర్ణయము కూడ.

**"భారతీధార్మికవిజ్ఞానపరిషత్తు"** స్థాపింపబడుటలోనిపరమార్థము కూడా సర్వ మానవసంతరణసేతువు నిర్మించుటయే యనుట నిశ్చప్రచము. ఈపరిషత్తుద్వారా వివిధ ప్రక్రియారూపములతో సర్వాదర్శకము లగుమహోన్నత ధార్మిక, సాంస్కృతిక, వైజ్ఞానిక విషయములు లోకోద్ధరణకై ప్రకటింపబడుచున్నవి. ఈపరిషత్తును స్థాపించుటకు సంకల్పించిన శ్రీశ్రీశ్రీ నృసింహానందభారతీస్వామివారు తమచిరకాలసమార్జితనిజానుభవ శక్తిని నిగూఢపఱచి, విశ్వకల్యాణవాంఛతో ప్రజాకోటికి చక్కనిముక్తసౌధసోపానములను నిర్మించి రనియే త్రికరణశుద్ధిగా చెప్పవలెను. బంగారమునకు తావి యబ్బినట్లు పరిషత్తు పురోభివృద్ధికి సహృదయవరేణ్యు లగు బొల్లేపల్లి సత్యనారాయణ లలితాంబదంపతులు సర్వరీతుల చేయూత కూర్చుట ప్రశంసనీయము. పదవులకై ప్రాకులాడక కేవలవిశ్వ శ్రేయోభావముతో వీరు పరిషత్తునకు దోహదకారు లై తమసద్భావశక్తిని సర్వతోముఖ కృషితో పంచుచున్నారు.

అనేకసంవత్సరములనుండి హృదయమందు దాగి మాగియున్నసత్సంకల్ప బలము వజ్రసంకల్పముగా మారి, ఆస్తికశిఖామణు లందరికీ ఆదర్శప్రాయ మైనబంగారు బాటకు మలచుచు, జీవితచరమగమ్యముగా నిరూపించుట మహత్తరజ్ఞానతపస్సుగా భావించుచున్నాము.

**భారతీ**పదమందలి**సారస్వత**బలమును, **ధార్మిక**పదగత మైన **వైదికధర్మ**శక్తిని, **విజ్ఞాన**పదమం దిమిడియున్న**విశ్వతోముఖశ్రేయ**స్సాధకసంపదను, తఱచి తఱచి భక్తులకు, జిజ్ఞాసువులకు, ఆస్తికమణులకు దైవికసంపత్తిని కరతలామలకము చేయుటయందు

కృతకృత్యత సాధించుటయే సారాంశము. ఈపరిషత్పోషకులు తొలుతగా గణపతి చతురావృత్తి తర్పణములతో నారంభించి, "చతుర్లక్షజపప్రీతః" అన్ననామప్రధానభావమును సార్థకపరచి, ''అష్టద్రవ్యహవిఃప్రియః'' అనునామవైశిష్ట్యమునకు వన్నెగొలిపి, ఆటోపములకు పాటుపడక, స్వానుభవమకరందమును **శ్రీమహాగణేశతత్త్వవైభవ**సుధతో మేళగించి, భక్తకోటికి ప్రసాదముగా సమర్పించి, ధన్యత గడించుట సర్వజనవిదితము. తదుపరి శివపూజావిధికి తగినంతజ్ఞానము పొంది, రుద్రాభిషేక, పారాయణ, హోమ విధానములతో **"జ్ఞానం మహేశ్వరా దిచ్ఛేత్"** అన్న సువర్ణసూక్తికి నెల వై **"శివార్చనము"** అన్నభక్తిజ్ఞానసుధాకలశము నందించి, "సత్యం శివం సుందరమ్" అనువిశ్వభావనామోద మును నలుదెసలందు వ్యాపింపజేయుట పురాపుణ్యవిభవము.

**"శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్"** అన్న జగద్గురువులఅంతశ్శక్తి ప్రభావప్రబోధమును దృఢముగా హృదయమున హత్తుకొలిపి **"కలౌ చండీవినాయకౌ"** అన్న సత్ఫలశక్తిప్రదవాక్యము నాకళించుకొని, అంతరార్థమును గమనించి, చండీయాగ, లలితాపారాయణ, సువాసినీసమర్చన, మణిద్వీపసభాప్రదర్శనాదులతో, జగదంబకరుణా కటాక్షబలమునకు నెల వై, అమ్మకనికరము అందరియందు ప్రసరించవలె నన్నతలంపుతో అనేకపండితులసూచనలను, శాక్తేయవాఙ్మయపరిశోధనలను సలిపి, **''శ్రీదేవీ మాహాత్మ్యము''**ను ప్రకటించుట వారిఆత్మశక్తికిని, సద్భక్తికిని, విశ్వకల్యాణసక్తికిని, సమగ్ర మైనమణిదర్పణముగా మేము త్రిశుద్ధిగా తెలుపుచున్నాము. ఈకార్యకలాపములందు మేము పూర్తిగా పాల్గొని, స్వానుభవమును సహృదయామోదరూపమున వెల్లడించుచున్నాము. ఇది స్తవము కాదు. వాస్తవము. మే మీగ్రంథమును సమగ్రముగా పరిశీలించితిమి. ఇది శ్రీవిద్యోపాసకు లందఱికిని శిరోధార్య మైనమహత్తరగ్రంథము. దీనిపారాయణముచే భక్తులు జగదంబదయకు పాత్రు లగుదురు గాక. దీనిపారాయణచే ఐహిక, పారలౌకికసంపద తప్పక లభించును. అమ్మయందు భక్తి యేర్పడుట చరమజన్మలక్షణ మని గుర్తింపవచ్చును.

"భారతీధార్మికవిజ్ఞానపరిషత్తు" ఇతోధికవృద్ధితో వర్తమాన, భవిష్యత్ ప్రజాకోటికి చైతన్య, జ్ఞాన, పారమార్థికసంపత్తిని చేకూర్చగల దని దేవీపాదపద్మయుగమును మనసా స్మరించుచున్నాము. పరిషదభివృద్ధికై పాటుపడుచున్న శ్రీబొల్లేపల్లి సత్యనారాయణ లలితాంబదంపతులపై, శ్రీగణేశ, కోటీశ్వర, చండీపరదేవతానుగ్రహసుధ ప్రవహించు గాక, వారికృషి నిరంతరాయమై పురోగమించు గాక.

ఇట్లు

**కూచిభట్ల మల్లికార్జునశాస్త్రి**

**చింతలపాటి నరసింహదీక్షితశర్మ**

# భారతీధార్మికవిజ్ఞానపరిషత్
# ఆవిర్భావం, లక్ష్యాలు, విన్నపములు

**చతుర్భుజే ! చంద్రకళావంతసే ! కుచోన్నతే ! కుంకుమరాగశోణే !**
**పుంద్రేక్షుపాశాంకుశపుష్పబాణహస్తే! నమ స్తే జగదేకమాతః!**
**వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,**
**జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ.**
**"సర్వే భద్రాణి పశ్యంతు, మా కశ్చి ద్దుఃఖభాగ్ భవేత్"**

నిష్కామభావంతో సనాతనధర్మనిష్ఠావసుధైకకుటుంబమే ధ్యేయంగా గల మన సనాతన పవిత్రఋషిసంప్రదాయపరమలక్ష్యాలు, సమాజంలోనిప్రతిఒక్కరికి అందించా లనీ, ఇహపరాలలో మేలు కలిగేలా చేయా లనీ, అందుకు ప్రజలను సముత్సాహపరచా లనీ, ధర్మార్థకామమోక్షప్రాప్తి కను వైనసాధనసంపత్తిని విశ్వ కల్యాణదృష్టితో కలుగజేయా లనీ, ఈ**భారతీధార్మికవిజ్ఞానపరిషత్తు**ను 1995 ఫిబ్రవరి 12 (రథసప్తమి)న **శ్రీనృసింహానందభారతీస్వామి**వారు గుంటూరు, అశోక్‌నగర్‌లో ప్రారంభించినారు.

**మాపరిషత్ లక్ష్యాలు :**

అహింసావ్రతమూ, సత్యనిష్ఠా, ధర్మనిరతీ, మానవుడిప్రధానఆశయాలుగా– సమకాలీనమానవసమాజం కుటుంబపర మైనరకరకాలఒత్తిడులనుండీ, అశాంతుల నుండీ, ఉద్ధరింపబడటానికిగాను, ప్రజాజీవనంలో నైతికంగా ప్రబలిన అశాంతిని తొలగించి, ఆధ్యాత్మికంగా ప్రజలను వేదధర్మాభిముఖులనూ, ఆసక్తులనూ చేయడం.

విశ్వశాంతికొరకు వేదోక్తధర్మకర్మాసక్తీ, అహింసవ్రతపాలనా, ధర్మనిష్ఠా మొద లైనవాటిని పాటించి, ఆసక్తినీ, అభిరుచినీ కలిగించి, ఆచరణమూలాన ప్రజలలో వైరభావాన్ని పోగొట్టి, ఐకమత్యాన్నీ, సర్వదేవతాసమన్వయబ్రహ్మభావననూ సంపాదించటం, తద్వారా భారతీయసమాజానికి ఆధ్యాత్మికనవచైతన్యం కలిగించి, విశ్వకల్యాణం సాధించటం, ఈసంస్థప్రధానలక్ష్యాలు.

**వేదధర్మప్రచారము :**

**"వేదాః ప్రమాణమ్"** వేదాలే మనందరికీ ప్రమాణాలు, అవి సమస్త ప్రపంచనిధులు. **'వేదో అఖిలధర్మమూలమ్'** వేదమే సర్వధర్మాలకూ మూలం. కాబట్టి వేదాలనూ, వేదోక్తధర్మాలనూ, వేదమూర్తులూ, బ్రహ్మనిష్ఠులూ, అనుభవాదర్శ భావనిధులూ అయినవ్యక్తులద్వారా బహుముఖంగా మానవుడు ఆధ్యాత్మికంగా వికాసాన్ని పొందటానికి, దేవ, ఋషి, పితృఋణా లనేఋణత్రయంనుంచి విముక్తిని పొందాలి. అందుకోసమే వైదికకర్మాచరణం, వేదమార్గానుసరణం ధర్మప్రవృత్తి అత్యంతావసరం. దీనికి సత్యధర్మప్రచారమూ, ఆచరణమూ రెండూ కావాలి. ఈ సంస్థ ఆలక్ష్యసాధనకై పూనుకొంటున్నది. దీనిపరమాశయం కూడా వేదధర్మబద్ధమే. అటువంటివేదధర్మామృతసారం వంటి, గీతాఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములను, తెలుసుకోవడం కూడా నేడు అవసరం.

**సాధుపండితగోష్ఠులు, ప్రవచనాలు :**

రామాయణభారతభాగవతాలూ, "ప్రస్థానత్రయము" ఇంకా వివిధపురాణేతిహాసాలను గురించీ – బ్రహ్మవేత్తలూ, తురీయాశ్రమస్థులూ, పండితులూ, అయిన ఉత్తములద్వారా ప్రవచనాలు చేయించటం,

చరిత్రప్రసిద్ధు లైన, కశ్యప, అత్రి, భరద్వాజ, వశిష్ఠ, విశ్వామిత్ర, గౌతమ, అగస్త్యాదు లైన ఎందరో మహర్షులూ, సనాతనసంస్కృతీసాహిత్యవికాసాలను సర్వతోముఖంగా విస్తరింపజేసిన వాల్మీకి, వ్యాస, శంకర, భోజ, కాళిదాసాదులూ, నిష్కామయోగు లైన జనకమహారాజు, షట్చక్రవర్తులూ, షోడశమహారాజులూ, మొద లైనమహోదయుల ఆదర్శజీవితవిశేషవిషయాలనూ, నాటినుండి నేటివరకూ ఆదర్శమార్గమును అనుసరించినమహాపురుషులూ, మరియు నిష్కామభావంతో సంఘసేవ చేసినమహాత్ములూ, కవులూ, శిల్పులూ, కళామతల్లికి జీవితం ధారపోసిన సదాశయులూ, మంత్రదీక్షాపరులూ, అజ్ఞాతంగా ఉన్నసచ్చరిత్రులూ, ఉత్తమాదర్శ వర్తనులూ, మొద లైనవారినిగూర్చినప్రవచనాదులతో వారికి సముచితరీతిలో గౌరవసత్కారము లందించుటం, సంస్థ ఆచరిస్తున్నది.

**నామపారాయణలు, మంత్రానుష్టానములు, సామూహికనామపారాయణలు :**

శ్రీలలితాసహస్రనామపారాయణం : సంకల్పించినసంఖ్య 108 కోట్లు.
శ్రీవిష్ణుసహస్రనామం : సంకల్పించినసంఖ్య 12 కోట్లు.
చండీసప్తశతిపారాయణం : సంకల్పించినసంఖ్య 1 లక్ష
రుద్రనమకచమక పారాయణలు : కొన్ని లక్షలు

గాయత్రీ, గణపతి, నవార్ణ, అష్టాక్షరీ, పంచాక్షరీ, లక్ష్మీనారాయణ, ఆంజనేయ, ఆదిత్య, సుబ్రహ్మణ్యాదిమంత్రానుష్ఠానములను యథాశక్తిగా అనుష్ఠానం చేయించడం, అవకాశాన్నిబట్టి వివిధస్తోత్రపారాయణలను సామూహికముగా నిర్వహించటం, ఆసక్తి కలవారికి ఆయాపారాయణలు చేసేపద్ధతులు నేర్పించటంద్వారా మానసికతృప్తి సమకూర్చటం, దీర్ఘసత్రయాగములు నిర్వహించటం.

వీటినిర్వహణకై ఒకనదీతీరాన ఒకఆశ్రమం నిర్మించి, వారికి పారాయణ గ్రంథములు అందించటం మాఆశయం.

**హోమాలు :**

**"అగ్నిముఖా వై దేవాః"** అని మనవేదాలు తెల్పుతున్నాయి. అగ్నిలో హోమం చేసినహవిస్సును దేవతలు స్వీకరించి, దేశసుభిక్షస్థితికీ అధికాధికంగా తోడ్పడతారు. హోమప్రక్రియవల్ల వాతావరణమాలిన్యప్రక్షాళన కూడా జరుగుతుంది. అందుకోసం ఆసేతుశీతాచలం – నైమిశారణ్యంలోనూ, అష్టాదశపీఠాలలోనూ, స్వామీజీల ఆశ్రమాల లోనూ, హిమాలయాదిపావనపర్వతప్రాంతాలలోనూ, గంగాయమునాది పుణ్యనదీ తీరాలలోనూ, ప్రముఖు లైన పెద్దలసమక్షంలోను గణపతి, చండీ, రుద్ర, గాయత్రీ, లక్ష్మీనారాయణ, నవగ్రహశాంతి, సుదర్శనాదిహోమాలు చేయించటం, ఆసక్తి కలవా రెవ రైనా కోరితే ఎక్కడి కైనా సరే వెళ్ళి దేవాలయప్రతిష్ఠలు ఈకార్యక్రమాలు నిరపేక్షాభావంతో నిర్వహించటం.

**అర్చనలు :**

శ్రీవిద్యాసంప్రదాయానుసారంగా ప్రతిమానవుడిలోనూ దైవత్వ మున్న దని భావించి వారిని గౌరవించడం ఆనాదినుండీ మనభారతీయులకు వస్తెతెచ్చిన ఆర్షసంప్రదాయం. ఆదృష్టితో కన్యకలకూ, సువాసినులకూ, వృద్ధదంపతులకూ అర్చనలు నిర్వహించటం వారికి యథోచితసత్కారాలు చేయడం.

**ప్రచురణలు :**

నామపారాయణమునకు వివిధస్తోత్రాలనూ, భక్తిగీతాలనూ, రామాయణ, భారత, భాగవతాది ప్రధానగ్రంథాలనూ, మానవులఆరోగ్యానికీ సంఘాభ్యుదయానికీ ఉపయోగపడేఉత్తమగ్రంథాలనూ, మహాపురుషజీవితచరిత్రలనూ, ప్రచురించి సామాన్యునికి అందజేయటం మరొకప్రధానలక్ష్యం.

**వృద్ధాశ్రమస్థాపనం :**

నేటిసామాజిక, సాంఘిక, కుటుంబఆర్థికపరిస్థితులప్రభావంవల్ల పెద్ద లైన తల్లిదండ్రులనూ, పూర్తిగా వృద్ధులనూ, ఆదరించేఆసక్తి లోపించింది. వారిజీవిత యాత్ర దుర్భరంగా మారింది. కాబట్టి ఇట్టివారికోసం ఒకఆశ్రమం స్థాపించటం అవసరం. 65సంవత్సరాలు పైబడినవారికీ, అనాథులకూ, వికలాంగులకూ, నిస్సహాయులకూ, కులమతవిచక్షణ లేకుండా సేవ చేసేనిమిత్తం నదీతీరాలలో ఒక ఆశ్రమాన్ని స్థాపించి, వైద్యాదిసౌకర్యాలతో వారికి తోడ్పడుతూ, ఆఆశ్రమంలో గోపోషణతోపాటుగా పైన తెల్పినకార్యక్రమా లన్నీ నిరంతరంగా నిర్వహించటము సంస్థ అభిప్రాయము.

**దేవాలయాలు, ఆశ్రమాలు, కల్యాణమండపాలు జీర్ణాలయోద్ధరణం :**

శిథిలావస్థలో ఉన్నదేవాలయాలనూ, మఠాలనూ, సత్రాలనూ, విద్యాలయాలనూ, గ్రంథాలయాలనూ బాగుచేయిస్తూ, వాటికి అనుకూల వాతావరణాన్ని కల్పించి, నిత్యకార్యక్రమాలను నడిపించటం.

ఇవీ ఈసంస్థఆశయాలలో ముఖ్య మైనవి.

**భారతీధార్మికవిజ్ఞానపరిషత్**

గుంటూరు.

# శ్రీదేవీమహాత్మ్యం - సంపూర్ణ శాస్త్రవిద్య

'చండీసప్తశతి' గా ప్రసిద్ధిచెందినఅద్భుతగ్రంథానికి అసలు పేరు "దేవీమాహాత్యం". కానీ దీనిని అగమరీతిలో పారాయణ, హోమావిధులుగా పేర్కొన్న తంత్రాదీశాస్త్రాలు "చండీసప్తశతి' గా వ్యవహరించాయి. కొందరు దీనిని 'నవశతి'గా కూడా రూపొందించి, హోమపారాయణాదివిధిక్రమాన్ని ఏర్పరచారు.

ఏదేమైనా – ఈగ్రంథానికున్న మహిమా, ప్రశస్తి ఎనలేనిది అని స్పష్ట మౌతోంది. వేదాలలో రుద్రనమకంవలె, పురాణాలలో ఈగ్రంథం మహి మాన్వితంగా ప్రసిద్ధి పొందింది. పురాణవాఙ్మయంలో జపహోమపారాయణవిధి ఉన్నది ఈఒక్కభాగానికే నన్నది అద్భుత మైనఅంశం. మార్కండేయపురాణం లోని ఈగ్రంథం మనువులచరిత్రలను చెప్తూన్నసందర్భంలోనిది. నిజానికి ఇది మనుచరిత్ర. పధ్నాలుగుమంది మనువులలో ఒకడైన సావర్ణిమనువు గాధ. ఈమనుచరిత్ర దేవీమాహాత్మ్యం. దేవీప్రాధాన్యమే దీనిలో ప్రధానాంశం. ఒకపరాజితరాజు దేవీఆరాధనచే జయశీలు డై, అనంతరజన్మలో మను వయ్యాడు – అన్నది ముఖ్యగాథ.

నేడు ఈచరిత్ర మాత్రమే – 13 అధ్యాయాలశాస్త్రంగా మంత్రత్వాన్ని కలిగిఉంది. 578 శ్లోకాలను ఉపాసలతో కలిపి తగినవిభాగం చేసి, 700 మంత్రాలుగా మంత్రశాస్త్రాలు విధివిధానాలను ఏర్పరచాయి.

ఈమంత్రస్వరూపపురాణభాగానికి ప్రధానదేవత ఎవరు? చండీ, దుర్గాదినామాలతో మంత్రవిభాగాలు నిర్దేశిస్తున్నాయి. దృష్ట్వా సా చండికా (దేవీ. 3.27) నిహంతుం చండికాం కోపాత్కృత్వా యుద్ధం (దేవీ. 9.6) పరితుష్టా ప్రత్యక్షం ప్రాహ చండికా (దేవీ, 13.10) దుర్గే స్మృతా హరసి (దేవీ.4.16) అనేవిధంగా చండిక (చండి) నామం, అలాగే దుర్గానామం అక్కడక్కడా ఉన్నా, మూలగ్రంథంలో 'దేవీ' శబ్దమే సాధారణంగా అనేకస్థలాలలో తరుచుగా కనబడుతుంది.

'దేవి' పరాశక్తికి ఉన్న అసలైననామం. 'దుర్గాం దేవీం శరణ మహం

ప్రపద్యే' ప్ర ణో దేవీ సరస్వతీ' మేధా దేవీ జుహోమీణా శ్రియం దేవీ ముపహ్వయే', అని వేదమంత్రాలు పలుతావుల్లో జగదంబను 'దేవీ' శబ్దంతోనే ప్రవచించాయి. ఆదేవియే త్రిశక్తులుగా, దశమహావిద్యలుగా, బహురూపాలతో, అనేకఉపాసనా సంప్రదాయాలలో, అనేకవిధాలుగా ఆరాధింపబడుతున్నది. .

'మేధాసి దేవి విధితో అఖిల శాస్త్రసారా' (దేవీ. 4.10)

సౌమ్యాని యాని రూపాణి' (దేవీ. 5.24) వంటి దేవీమాహాత్మ్యశ్లోకాలలో పైవిషయం స్పష్ట మౌతోంది.

ఇది యజ్ఞరూపంగా వినియోగింపబడుతోంది కనుక 'కర్మచండి' అనవచ్చు. మంత్రజపాదులుగా యంత్ర-తంత్ర విధానాలతో చక్కగా రూపుదిద్దుకున్నది కనుక 'ఉపాసనాశాస్త్రమ్'. కాస్త ఉపనిషత్పరనసంస్కా రంతో చూస్తే, ఇది 'వేదాంతశాస్త్రం' కూడా. ఇలా కర్మోపాసనాజ్ఞానస్వరూప మైన సంపూర్ణమంత్రరాశి.

దీని ఉపక్రమోపసంహారాలలోనే ఈవిషయం స్పష్టమౌతుంది. అపౌరుషేయ మైనవేదంవంటిదే ఇది. అని సంప్రదాయజ్ఞులమాట. ఏడువందలమంత్రాలుగా ఉన్న 578 శ్లోకాలతో ఏడువందల బీజాక్షరాలున్నా యని అభిజ్ఞులు ఉద్ధరించారు. ఔచితీమంత మైనదర్శన మిది. అందుకే శ్లోకాలపారాయణ ఆశ్చర్యకరమైన ప్రయోజనాలను యజమానికి సమకూర్చుతోంది. మంత్రంవలెనే హవనక్రియకు వినియుక్త మౌతోంది.

సుష్ఠు దక్షిణాచారసంప్రదాయానికి చెందిన పరంపరాగత అద్వైతవిద్యా పీఠాలు సహితం తరచు దీనిని యాగంగా, పద్ధతిలో నిర్వహిస్తూ, అనేకమందికి అభీష్టాలను సిద్ధింపజేస్తున్నాయి.

ఆసేతుశీతాచలం శాక్తేయం విభిన్నమార్గాలలో అనుసరణీయంగా ఉన్నా, అన్నిమార్గాలవారికీ ఈదేవీ(చండీ)పారాయణమాత్రం శిరోధార్యం. శరన్నవ రాత్రులవంటి బహుపర్వాలవేళల్లో ఈగ్రంథపారాయణ, హవనాదులు ప్రధానయజ్ఞంగా ఉంటున్నాయి.

ఇందులో ఉపాస్య అయిన 'దేవి' వేదవేదాంతప్రతిపాద్య అయిన పరాశక్తియే. ఈమాతకృప - అభీష్టసిద్ధినీ, ఆరోగ్యాదులను ప్రసాదించేదిగానే

అందరూ భావిస్తున్నారు. కానీ, ఈగ్రంథస్వరూపాన్నీ, దేవీతత్త్వాన్నీ, ఆలోచనాత్మక మైనకక్షఅక్షరరాశిగా చేసేవారు అరుదు. ఆకోణంలో ఈపురాణవిద్యను పరిశీలిస్తే, ఇది బ్రహ్మవిద్యగా సాక్షాత్కరిస్తుంది.

భగవద్గీతవలెనే ఈగ్రంథం కూడా అధ్యాత్మవిద్య. గీతలో మొదటి అధ్యాయం, ఇందులోని తొలిఅధ్యాయం – విషాదయోగాలే. "నష్టో మోహః" (గీత. 18.73) అనేది రెండు గ్రంథాలకు ఫలశ్రుతి.

సురథుడు – అధికారం. సమాధి – సంపద. ఈరెండింటినీ వలచిన మోహం అవిద్యాస్వరూపం. అహానికి ఆలంబనాలైన ఈరెండువిషయాల మిథ్యాత్వాన్ని పరిశీలించి, మోహానికి మూల మైనఅవిద్యను తొలగించు కొనేందుకు గురూపసదనం చేసినజిజ్ఞాసువుకి 'సుమేధ' రూప ఆచార్యుడు చేసినఉపదేశమే "దేవీమాహత్యం', 'అ థాతో బ్రహ్మజిజ్ఞాసా' అనే బాదరాయణ ప్రథమబ్రహ్మసూత్రం దీనిలోనిప్రథమాధ్యాయం.

సృష్టిస్థితిలయలను చేసే విశ్వచైతన్యరూపిణి దేవి. ఈమహాగ్రంథంలో రెండు అంశాలు 1. సురథ, సమాధులు సుమేధను ఆశ్రయించుట, దేవీకృపను పొందుట, 2. మధుకైటభవిద్రావిణిగా, మహిషాసురమర్దినిగా, శుంభనిశుంభ సంహారిణిగా దేవి తాల్చిన మూడుమూర్తులు, మూడుచరిత్రలు.

మొదటిది దేవిఆరాధనవిధి. రెండవది దేవీనామరూపగుణలీలా. మహిమా తత్త్వప్రతిపాదన.

సురథ, సమాధు లిరువురూ ఒకేగురువును ఆశ్రయించి, ఒకేపద్ధతిలో తల్లిని ఉపాసించారు. ఒకేజగన్మాత ఇరువురికీ సాక్షాత్కరించింది. కానీ ఇద్దరు కోరినవి వేర్వేరు కోరికలు.

సురథుడు అవిభ్రంశ మైనరాజ్యాన్ని కోరాడు. వాసనాబలాన్ని అనుసరించి, కోరిక లుంటాయి. ఆకోరిక ననుసరించి భగవత్కృపాఫల ముంటుంది. తల్లి పోయినరాజ్యసంపద నివ్వడమే కాక, అనంతరజన్మలో మనువయ్యేలా అనుగ్రహించింది. ఇక సమాధి – శుద్ధవైరాగ్యంతో సంగవిచ్యుతికారకమైన జ్ఞానాన్ని, మమకార మనేఅవిద్యను నశింపజేసేవిద్యని ప్రార్థించాడు. తల్లి ప్రసాదించింది. ధర్మబద్ధ మైనభుక్తినీ, శాశ్వత మైనముక్తినీ కూడా ఇవ్వగలిగే

పరమాత్మిక దేవి అనే చక్కనిప్రతిపాదన దీనిద్వారా జరిగింది. భుక్తిముక్తి ప్రదాయక మైన ఈశ్వరానుగ్రహం విశద మయింది.

ఈవృత్తాంత మంతా బ్రహ్మవిద్యయే అని స్పష్టంగా బోధపడుతోంది.

"తత్ సర్వం శ్రోతు మిచ్ఛామి త్వత్తో బ్రహ్మవిదాం వర!" (దేవీ. 1.62). అని ఇరువురిపక్షాన సురథుడు పరిప్రశ్నించాడు.

ఇందులో గురు వైనసుమేధను 'బ్రహ్మవిదాం వర' అనీ సంబోధించడం లోనే చక్కనిసూచన ఉంది. బ్రహ్మవిదులలో శ్రేష్ఠుని అడగవలసింది బ్రహ్మవిద్యనే. అతడు చెప్పేది ఆవిద్యనే.

ఈశ్వరునిమాయాశక్తి సంసారప్రవర్తినిగా అవిద్యారూపంగా, మోహ పాశాన్ని ప్రయోగిస్తోంది. యోగ్యు డైన సాధకుడికి 'పాశవిచ్ఛేదినిగా జ్ఞానాన్ని (విద్యను) ప్రసాదిస్తోంది. 'య మే వైష వృణుతే తేన లభ్యః' అన్న ఉపనిష దనుసారంగా అనుగ్రహిస్తే గానీ జ్ఞానం లేదు.

'విద్యావిద్యాస్వరూపిణీ', 'పశుపాశవిమోచనీ' అయినజగదంబ కృపా విశేషమే ఈమంత్రసాధనవలన పొందవలసినసిద్ధి. ఆకృపార్థి యైనజిజ్ఞాసువే దీనికి అధికారి. ఈవృత్తాంతంలో మరో అంద మైనసంకేతవిద్య ఉంది. క్రియాశీల మైనశరీరం, ప్రేరక మైనబుద్ధి ఈరెండూ సాధకుడు ఏవిధంగా సాధనోప యోగాలుగా మలచుకోవాలో 'నామాల' ద్వారా చక్కనిసంకేత మివ్వబడింది.

**సురథుడు:** ఇంద్రియహయాలతో ఉన్నశరీరమే రథం. సత్కర్మాచరణతో జన్మక్రియాశీలకశరీరమే సురథం.

**సమాధి:** సమబుద్ధి కలిగినవిచారణశీల మైనబుద్ది (ధీః) సమాధి.

సురథ మైనశరీరం నిష్కంటక మైనధర్మాచరణతో సుకృతం కావాలి. బుద్ధి బ్రహ్మజ్ఞాననిష్ఠం కావాలి. రెండింటినీ ప్రసాదించగలిగేఆత్మశక్తియే దేవీకృప.

"సుమేధ'ను (బ్రహ్మజ్ఞానాన్ని) ఆశ్రయించినశరీరబుద్ధులే సురథ, సమాధులు. బ్రహ్మవిద్యావ్యాప్తికై మొదటిఅంగం చిత్తశుద్ధికరసత్కర్మ. ఇది సురథతత్త్వం. శుద్ధి పొంది, బ్రహ్మోభిముఖ మైనచిత్తవృత్తి సమాధితత్త్వం.

మొదటిఅంశంలో దాగినఆంతర్య మిది.

రెండవఅంశం ఐన – దేవీచరిత్రలలో ప్రధానంగా మూడు ఘట్టాలు,

నాలుగుస్తోత్రాలు, లోతైన మార్మికవిషయాలు, వాటిలో మంత్రసంకేత, తాత్త్వికసూచనలు కథావ్యాజంతో సమకూర్చబడ్డాయి.

1. చరిత్రలక్రమంలోనే చక్కనిఔచిత్యం ద్యోతక మౌతుంది.

ఈమూడుచరిత్రలపద్ధతి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి భేదవిద్యలతో కూర్చబడినది.

2. వేదసూక్తులలో చెప్పిన సర్వదేవీసూక్తాలసారమే ఇందులోని స్తోత్ర చతుష్టయం. రాత్రిసూక్త, దేవీసూక్త, అధర్వశీర్షాదివైదికమంత్రద్యుతులు ఇందులో ప్రకాశిస్తాయి. కేనోపనిషత్తువంటి జ్ఞానకాండలోనితత్త్వదీపికలు. భాసిస్తాయి.

ప్రథమచరితలో దేవీఆవిర్భావానికి మునుపే బ్రహ్మకృతస్తుతి (రాత్రి సూక్తం), మధ్యమచరిత్రలో అసురసంహారానంతరం దేవతలచేత మహిషాంతకరీ సూక్తం, ఉత్తమచరిత్రలో దేవిఆవిర్భావానికి పూర్వం దేవతలచే (అపరాజితా)దేవీ సూక్తం – పునః అసురసంహారానంతరం నారాయణీసూక్తం. ఈకూర్పు రమణీయం.

స్తోత్రచతుష్టయంలోనిప్రతిశ్లోకం వేదసూక్తాలలో, ఉపనిషత్తులలో నిగదిత మైనబ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదిస్తున్నదే. వాటిని అర్థానుసంధానపూర్వకంగా మననం చేస్తే, బ్రహ్మజ్ఞానం సిద్ధిస్తుంది. – 'యయా తత మిదం జగత్' – (దేవీ. 4. 2) ఎవరిచేత ఈజగతి వ్యాపింపబడినదో – అనే సుమేధవచనం 'ఈశావాస్య మిదగ్ం జగత్' అనే ఉపనిషద్వాక్యమే.

'య చ్చ కిఞ్చిత్ క్వచిద్ వస్తు సదసద్ వాఖిలాత్మికే,

తస్య సర్వస్య యా శక్తిః.....” (దేవీ. 1. 63) అనే ప్రథమస్తుతిలోనివాక్యం

య చ్చ కించిత్ జగత్ సర్వం దృశ్యతే శ్రూయతే (అ)పి వా

అంతర్బహి శ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః' అనే వేదవాక్యార్థాన్ని చెబుతున్నదే.

ప్రథమచరితం, ప్రథమస్తోత్రం కూడా ఋగ్వేదీయనాసదీయసూక్త స్వరూపంగా కొందరు విజ్ఞులు భావించారు. పురాణములు వేదోపబృంహణ ములే నన్న ఆర్షవాక్యం స్మరణీయం. బ్రహ్మవిద్యాస్వరూపంగా గోచరించే దేవీమాహాత్మ్యం లోని స్తుతివాక్యా లన్నీ వేదంలోని ఉభయకాండలస్వరూపమే.

అందుకే దీనిని వేదమంత్రసమానంగా హోమాదులలో వినియోగించి, యజ్ఞఫలాలను పొందగలుగుతున్నారు.

**త్వ యైత ద్ధార్యతే విశ్వం, త్వ యైతత్ సృజ్యతే జగత్,**
**త్వయైతత్ పాల్యతే దేవి, త్వ మత్స్యంతే చ సర్వదా (దేవీ. 1.56)**

అనే మొదటిఅధ్యాయంలోని స్తుతిశ్లోకం – 'యతో వా ఇమాని భూతాని జాయన్తే....' (3.1.1) అనే తైత్తిరీయోపనిషద్వాక్యార్థాన్ని "తస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః' అనే కఠోపనిషత్తు(2.25) వాక్యార్థాన్ని తెలియజేస్తున్నది.

**సుధా త్వ మక్షరా నిత్యే త్రిధా మాత్రాత్మికా స్థితా,**
**అర్ధమాత్రా స్థితా నిత్యా యా నుచ్చా ర్యావిశేషతః॥ (దేవీ. 1.54,55) –**
అనేశ్లోకం మాండుక్యోపనిషత్తులోని ప్రణవార్థవిచారణే.

**మహిషాంతకరీసూక్తంలోని 'యస్యా స్సమస్తసురతాసముదీరణేన తృప్తిం ప్రయాతి సకలేషు మఖేషు దేవి' (దేవీ. 4.7)**అనేశ్లోకం కర్మకాండక మైనయజ్ఞస్వరూపాన్ని ద్యోతకం చేస్తున్నది.

**'మోక్షార్థిభి ర్మునిభి రస్తసమస్తదోషైః వి ద్యాసి సా భగవతీ ....!** (దేవీ. 4.8) అనేశ్లోకం జ్ఞానకాండగత మైనబ్రహ్మవిద్యను స్ఫురింపజేస్తున్నది.

మొత్తంగా **'శబ్దాత్మికా సువిమలా ఋగ్యజుషాం నిధానం...'** (దేవీ. 4.9). అనేశ్లోకం కాండద్వయసముపేత మైనవేదమాతయే ఈగ్రంథప్రతిపాద్య దేవిగా స్పష్టం చేస్తున్నది.

**'దుర్వృత్తవృత్తశమనం తవ దేవి! శీలం'** (దేవీ. 4.20) వంటి శ్లోకపరంపర దేవీకృత అసురసంహారంలోని ఆంతర్యాన్ని ఆవిష్కరిస్తున్నది.

దేవిఆయుధాలు అసురసంహారకాలే కాక, భక్తరక్షణదక్షములు అనేభావం రుద్రనమకమంత్రాలలోని 'నమ స్తే అస్తు ధన్వనే...' అనేమంత్రాలరూపమే.

'అఘోరేభ్యో ఆథ ఘోరేభ్యో....' మంత్రం 'సౌమ్యాని యాని రూపాణి త్రైలోక్యే విచరన్తితే యాని చాత్యంతఘోరాణి...' (దేవీ. 4.25) అనేశ్లోకంలో గర్భిత మై ఉంది. 'అతిసౌమ్యాతిరౌద్రాయై...' (దేవీ. 5.11)

ధర్మరక్షణార్థం, అధర్మశిక్షణార్థం దేవి ధరించిన ఉగ్రరూపం. పరమేశ్వరుని మన్యుతత్త్వమే. అదే 'చండీ'నామంతో స్పష్టమౌతోంది. ఉభయనామాలు క్రోధార్థకాలే.

మంత్రప్రయోగం, పారాయణాదివ్యవహారాలను నిర్దేశించి మంత్ర శాస్త్రకల్పాలు "మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ' – అనే మూడు రూపాలుగా మూడుచరిత్రలుగా విభాగితాలు. కానీ 'దేవీమాహాత్మ్యం' మూలగ్రంథంలో మాత్రం ఈవిభాగం గోచరించదు.

ఇన్నిరూపాలుగా ఉన్నది ఒకేపరాశక్తి. ఆమె సర్వదేవాత్మిక. జగత్కారిణి. గుణమయి. మహామాయ. జగదతీతంగా తురీయ మైనబ్రహ్మతత్త్వం, మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వత్యాత్మిక అయిన ఏకశక్తియే ఈపరాశక్తి.

**ఏకై వాహం జగ త్యత్ర, ద్వితీయా కా మ మాపరా,**

**ప శ్యైతా దుష్ట! మ య్యేవ, విశంత్యో మద్విభూతయః ॥**

**(దేవీ. 10.3).**

అనే దేవీవాక్కు– 'ఏకం అద్వితీయం బ్రహ్మ' అనేవేదాంతవాక్యమే. అనేకములైన దివ్యమూర్తులు విశ్వప్రతిష్ఠకు, ఉపాసనకు స్వీకరించినవిభూతులే. 'అవిభక్తం, తత్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్' (గీత. 18.20) అనే గీతావాక్యం కూడా ఇందులో ప్రకాశిస్తోంది.

జగతి ఏర్పడుటకు పూర్వం బీజంలో, భూజంలో ఏఈశ్వరతత్త్వంలో ప్రకృష్టంగా లయ మైఉందో, ఆప్రళయతత్త్వమే మహాకాళి ఆవిర్భవించిన జగతి. "ధన మగ్ని ర్ధనం వాయుః ధనం సూర్యః....." అన్నట్లుగా ఈశ్వరీయ విభూతులతో నిండినది కనుక, ఆవిభూతులసమష్టిరూపం మహాలక్ష్మి,

విశ్వ మంతా ఈశ్వరరూపమే అనే ఎఱుక, జ్ఞానరూపిణి మహాసరస్వతి.

ఇదీ ఈమూర్తిత్రయక్రమంలోని విశేషం.

**సా విద్యా పరమా ముక్తే ర్హేతుభూతా సనాతనీ ।**

**సంసారబంధహేతు శ్చ సైవ సర్వేశ్వరేశ్వరీ ॥** (దేవీ. 1.44)

ముక్తికి హేతుభూత మైనసనాతనబ్రహ్మవిద్య, సంసారబంధకారిణి యైన జగన్నిర్వహణకారిణి, సర్వనియామకులకు నియామకురాలు – ఈదివ్యశాస్త్ర ప్రతిపాద్య. దుర్లభం, దుర్గమం ఐన పరబ్రహ్మతత్త్వమే దుర్గ. ఆతల్లి చేసిన అసురసంహారలీల లన్నీ అనుగ్రహరీతులే.

జ్ఞానప్రతిబంధకా లైన అవిద్యావృత్తులను నిర్మూలించే జ్ఞానశక్తి

విజృంభణయే ఈలీలలఆంతర్యం. దేవ్యుపాసనాక్రమంలో సాధకునిలోని జ్ఞాన విరోధు లైనఅహంకారాదులను నశింపజేసుకొనడమే ఈఘట్టాలలోని వివిధ దనుజులసంహారం. మధు మిష్టం కర్మఫలమ్ – (కఠోపనిషద్భాష్యం) కైటభః దుష్కృతఃకర్మగత అహంకార, ఫలాకాంక్షలను విడిచే నిర్మమత్వయోగమే మధుకైటభ సంహారం. యోగపరంగా కుండలినీజాగరణ, వేదాంతపరంగా జాగరిత మైన ఆత్మజ్ఞానం – ఈఅంశమే విష్ణువును మేల్కొలిపిన బ్రహ్మకృతస్తుతి. యోగనిద్రాక్షాత్కారం, బ్రాహ్మీస్థితి'. తత్త్వజ్ఞులు అసురశక్తులను వ్యాఖ్యానించిన తీరు అద్భుతం.

మోహమమకారనాశనం – మధుకైటభసంహారం ప్రథమచరితం. రజస్తమోగుణాల ఐక్యస్వరూపుడే మహిషాసురుడు. తత్సంహారం మధ్యమచరితం. ఆత్మఘ్న మై, ద్వైతభావసంపన్నమైన అహంకారమే (1)శుంభుడు. మమకారమే (2)నిశుంభుడు. కామం (3)రక్తబీజుడు. (రక్త మను రోగః, బీజం కారణం, యస్య సః) క్రోధమే (4)ధూమ్రలోచనుడు, కామరాగసహితబలమే (5)చండుడు, దర్పమే (6)ముండుడు.

ఈఅసురసంహారమే ఉత్తమచరిత.

**తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!**

**తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥** (గీత. 18. 62) – అని భగవద్గీత చెప్పినట్లుగా – సుమేధ ఇద్దరు శిష్యులను పరమేశ్వరిని శరణు పొంద మని ప్రభోదించాడు.

ధర్మ–భక్తి –జ్ఞానాత్మిక మైన అధ్యాత్మవిద్యాశాస్త్రంగా, కర్మోపాసనా జ్ఞానవిద్యగా 'దేవీమాహాత్మ్యం" ప్రకాశిస్తోంది.

ఐహికాముష్మికసాధనకు, పరమార్థజ్ఞానానికి ఒకేగ్రంథంద్వారా మహోపకారం చేసిన వ్యాసునిరచనాసంవిధానం ఆర్షదర్శనవైభవానికి తార్కాణం.

ఈశాస్త్రాన్ని సాంగోపాంగంగా రూపొందించి, అందిస్తున్న శ్రీయుతులు బొల్లేపల్లి సత్యనారాయణ లలితాంబ దంపతులు ధన్యులు. అభినందనీయులు.

**బుధజనవిధేయుడు**

**సామవేదం షణ్ముఖశర్మ**

# శ్రీదుర్గాసప్తశతీతత్త్వము

**విద్వాన్ కాశీభట్ల సుబ్బరామశర్మ**

**శ్రీమాత్రే నమః.** శ్రీదుర్గాసప్తశతి మార్కండేయపురాణములో శక్తి మాహాత్మ్యమును తెలుపు 13 అధ్యాయములభాగము. దానిలో సమస్తపురుషార్థ ప్రదాయక మగుశక్తిస్వరూపములు, చరిత్రలు, ఉపాసనలు మొద లైన వెన్నో నిరూపింపబడియున్నవి.

సర్వాభీష్టప్రద మగునీసప్తశతీస్తోత్ర మెవరిచేతను నిర్మించబడినది గాదు. వేదమునుండి యావిర్భవించినదే. **యథా వేదో హ్యనాది ర్హి తద్వత్ సప్తశతీ స్మృతా -** వేదా మనాది యైనట్లే సప్తశతియు అనాదియే యని భువనేశ్వరీ సంహితలో గనుపించును.

**సప్తశత్యా శ్చ సకలం, తత్త్వం వే ద్మ్యహ మేవ హి!**
**పాదోనం శ్రీహరి ర్వేత్తి, వేత్త్యర్ధం తు ప్రజాపతిః,**
**వ్యాస స్తురీయో ఽంశమ్ వేత్తి, కోట్యంశ మితరే బుధాః!**

సప్తశతీసంపూర్ణతత్త్వమును నే నెరుగుదును. శ్రీహరి మూడువంతులు ఎరుగును. ప్రజాపతి అర్ధమే. వ్యాసుడు నాలుగవవంతు ఎరుగును. అని మేరు తంత్రము చెప్పినది. దానిని వ్యాసుడు ప్రకటించినందున లోకములో వ్యాసకృత మనువ్యవహార మేర్పడినది. గుహ్యతమ మైన దేవీమాహాత్మ్యము దీనిలో నున్నది. వాక్యములతో అర్థములతో సప్తశత్యాత్మక మైనది. శుభప్రద మైనది. చిచ్ఛక్తి మహిమతో నిండియున్న దని రుద్రయామళము చెప్పుచున్నది.

దారిద్ర్యమును దొలగించుసప్తశతికి దేవత ఎవరు? ఆమెతత్త్వమును, స్వరూపమును దెలియజెప్పు మని యడుగగా పరమశివుడు పార్వతికి సప్తశతీ ప్రభావమును దెలిపెను.

ఈస్తోత్రమును పారాయణము చేయువా డెప్పటికి దారిద్ర్యము ననుభవించడు. ఆపరాశక్తియే దేవకార్యనిర్వహణకు, అసురసంహారమునకు అవతరించినది. మహాపదలు సంభవించినపుడు దేవతలు ప్రార్థించగా ఆమె ఆయాదేవతలుగా నవతరించి, వారిని రక్షించినది. వారిగాథ లన్నీయు 13 అధ్యాయములలో మార్కండేయపురాణములో చెప్పబడినవి. సప్తశతీస్తవము

దానిలోనిదే, దానిని పారాయణము చేయుటవల్ల సకలసుఖములు కలుగును. పరమదుర్లభ మైనసప్తశతీస్తోత్రపాఠమువల్ల సమస్తారిష్టములు తొలగి, సర్వ మంగళములు చేకూరు నని చిదంబరసంహిత చెప్పుచున్నది. యజ్ఞములలో అశ్వమేధము, దేవతలలో శ్రీహరి శ్రేష్ఠ లైనట్లు స్తోత్రములలో సప్తశతీస్తోత్రము ఉత్తమోత్తమ మైనది. దీనికి మించినస్తోత్రము మరి యొకటి లేదు. ఇది భుక్తిముక్తి ప్రదము. పరమపుణ్యప్రదము. మంత్రములో పరమపవిత్ర మైనది. అని డామర తంత్రమున చెప్పబడినది.

ఈసప్తశతిలో 7 నూర్లమంత్రము లున్నట్లు చిదంబరసంహితలో చెప్పబడినది.

**తస్మిన్ దేవ్యాః స్తవే పుణ్యే, మంత్రాః సప్తశతం శివే!**
**తస్మాత్ సప్తశతీ నామ, స్తవం పరమదుర్లభమ్॥**

సప్తశతమంత్రము లున్నందున ఇది సప్తశతి యైనది.

దీనికి సప్తశతి అను పేరున్నట్లు మేరుతంత్రములో గనుపించును. ఆతంత్రము దానిని వివరించుచు –

**మహావిద్యాదిసత్య స్తు, సప్త కల్పే తథా ఇమే।**
**బ్రహ్మేంద్రగురుశుక్రాణాం, విష్ణురుద్రసురద్విషామ్ ॥**
**ఉపాస్యా దేవతా జాతా, స్తా శ్చాత్ర బ్రహ్మణా స్తుతాః ।**
**తస్మాత్ సప్తశతీ త్యేవ, వ్యాసేన పరికీర్తితా॥**

మహావిద్య మొద లైన సప్తసతు లున్నందున సప్తసతి యైన దని వ్యాసుడు చెప్పెను. సప్తశతీస్తోత్రమున మూడుచరితములు గలవు. అందు ప్రథమ చరితమునకు బ్రహ్మ ఋషి, గాయత్రి ఛందస్సు, మహాకాళి దేవత. ఐం బీజము. అగ్ని తత్త్వము. ధర్మార్థము వినియోగము. దీనిలో మారణ మోహనములకు 90 మంత్రములు. ఉచ్చాటన స్తంభన ప్రయోగములకు 300 మంత్రములును గలవు. మధ్యమోత్తమచరిత్రలు విద్వేషవశ్యములకు, శత్రుప్రయోగములకు 300 మంత్రములు గలవు.

మహావిద్య మొద లగుసతులు సప్తమకల్పమందు బ్రహ్మ, ఇంద్ర, గురు, శుక్రులకు, విష్ణు, రుద్ర, సురద్విషులకు ఉపాస్యదేవతకై బ్రహ్మచే స్తుతించబడినది. కాన సప్తసతి యని వ్యాసుడు పేరిడెను. సప్తసతులు: – ప్రథమచరిత్రలో 1.

కాళి, 2. తార, 3. ఛిన్నమస్త, 4. సుముఖి, 5. భువనేశ్వరి, 6. బాల, 7. కుబ్జ అను ఏడుగురు.

మధ్యమచరిత్రలో 1. లక్ష్మి, 2. లలిత, 3. కాళి, 4. దుర్గ, 5.గాయత్రి, 6. అరుంధతి, 7. సరస్వతి అను ఏడుగురు,

ఉత్తమచరిత్రలో బ్రాహ్మి మొదలగుసప్తసతులు సప్తమాతృకలు. ఈయిరువదియొక్కసతులకు 1. నంద, 2. శతాక్షి, 3. శాకంభరి, 4. భీమ, 5. రక్తదంతిక, 6. దుర్గ, 7. భ్రామరి అనుసప్తసతులు సమష్టిరూపము. అందువల్ల మేరుతంత్రమందు సప్తసతి అని ఈగ్రంథము పేర్కొనబడినది.

**సప్తశతిలోనిచరిత్రనాయికలు:** మహాకాళి ప్రథమచరిత్రమునకు, మహాలక్ష్మి మధ్యమచరిత్రకు, మహాసరస్వతి ఉత్తమచరిత్రకు, నాయికలు. కానీ ప్రాధానికరహస్యమున 'సర్వ స్యాద్యా మహాలక్ష్మీః' అన్నిటికంటే ఆదిదేవత మహాలక్ష్మి యని చెప్పబడినది. దీనినిబట్టి యీామెయే పరాశక్తి యని స్పష్ట మగుచున్నది. ఈమె తామసరూపమే మహాకాళి. సాత్త్వికరూపము మహాసరస్వతి. మహాలక్ష్మి రాజసికశక్తి. అయినప్పటికి నిజమున కామె త్రిగుణరూపిణియే.

ఈదేవత సమస్తదేవతలతేజస్సుతో నవతరించి, మహిషాసురుని సంహరించి, లోకములను రక్షించినది. ఈగాథ మధ్యమచరిత్రలోనిది. ఈముగ్గురు మూర్తులు క్రమముగా తమస్, రజస్, సత్త్వగుణాత్మిక లని చెప్పుదురు. గుణస్వామినులు అనవచ్చు.

మహాకాళి తమోగుణస్వామిని యై, విష్ణువుతమోగుణమును అనగా చైతన్యరాహిత్యమును నశింపజేసి, ప్రసుప్తశక్తిని మేలుకొలిపి, మధుకైటభు లనురక్కసులను వధించినది. ఆమెవల్లనే బ్రహ్మ సృష్టిచేయ సమర్థుడయ్యెను.

మహాసరస్వతి సత్త్వగుణస్వామిని. బుద్ధితో అహంకార, మమకారము లను శుంభనిశుంభులను సంహరించినది. అలసత్వ మను ధూమ్రలోచనుని, క్రోధ మను చండముండులను, కామ మనురక్తబీజుని సంహరించినది. అనగా సూక్ష్మభావముతో నియంత్రించినది.

మహాకాళి తనపని ముగించి, యేమి పలుకకయే అదృశ్యురా లైనది. మహాలక్ష్మి తథాస్తు అని అంతర్హితురా లైనది. మహాసరస్వతి బృహద్రూపముతో గనుపించి యుపదేశించి మాయ మైనది. సంఘే శక్తిః అనుసిద్ధాంతము ననుసరించి

ఒకరు చేయలేనిపనిని పలువురు కూడి చేయుదురు. దుర్గా సప్తశతిలో దీనికి దగిననిదర్శనము లున్నవి. దేవాసురయుద్ధమున దేవతల నోడించి, మహిషాసురుడు ఇంద్రసింహాసనము నధిష్ఠించెను. అతనియెదుట నిలబడుట కెవరికిని శక్తిసామర్థ్యములు చాలవు. దేవతలు రాక్షసులతో నానా బాధలు పడుచుండిరి. ఒక్కసారి యందరియాత్మలు కోపముతో తుకతుక యుడికిపోయినవి. బ్రహ్మాదిదేవతలశరీరములనుండి యొక్కసారి తేజస్సు బయల్వెడలినది. ఆతేజస్సు లన్నీ యొక్కచోట చేరి, మహాలక్ష్మీరూపము ధరించినది. ఆమెయే మహిషుని మర్దించినది. దేవతలు వేరు వేరుగా నున్నప్పుడు చేయలేనిపనిని వారితేజ సొకటైనపుడు చేయగలిగినది. విజయప్రదశక్తి వారిలోనే యున్నది. బయటనుండి వచ్చినది గాదు.

వ్యవహారదక్షు లైనవారికి వాక్పటుత్వము తక్కువగా నుండును, వాణిజ్య వ్యవసాయదక్షులు సామాన్యముగా మితభాషు లైయుందురు. విద్యావంతులు సామాన్యముగా నైపుణ్యము గలిగియుందురు. ఇది లోకతత్త్వము.

సప్తశతి యీమనోవైజ్ఞానికానుభవమును స్పష్టపరచినది. ప్రథమ చరిత్రమున బ్రహ్మ చేసినస్తుతికి బదులు పలుకక మహాకాళి పనిచేసి యంతర్ధాన మైనది. మధ్యమచరిత్రలో దేవగణప్రస్తుతికి ఉత్తరముగా తథాస్తు అని మహాలక్ష్మి అంతర్హిత యైనది. కాని ఉత్తమచరిత్రలో దేవతల కుత్తరముగా (ఒకటిన్నర అధ్యాయము) వ్యాఖ్యానించినది. సామాన్యముగా ప్రపంచమున హింసా అహింసల – ప్రశ్న వివేకులహృదయమును కలచివైచును. శత్రువులను సమూలముగా నశింపజేయుటయే యని హింస కర్థము చెప్పుదురు. శత్రువులు పెట్టేబాధలు సహించుటయే అహింస యందురు. హన్యా దేవ ఆతాయినః – ఎదుర్కొన్న శత్రువును చంపితీరవలె నని ఒకవైపు స్మృతి చెప్పుచుండ ఇంకొకవైపు సర్వావస్థలలోను అహింసను పాటించవలె నని మహాత్ములఆదేశము. కాని మధ్యేమార్గమున నడచుసామాన్యున కిది యుపదేశము కానేరదు.

మహిషాసురుని వధించినతరువాత దేవత లందరు మహాలక్ష్మిని గాంచి అమ్మా! భగవతీ! నీవు దర్శనమాత్రముననే వీరిని భస్మము చేయగలుగుదువే! వీరిపై శస్త్రము ప్రయోగించవలసినఅవసర మేమి? దృష్ట్వైవ కిం న భవతీ ప్రకరోతి భస్మ, సర్వాసురా నరిషు యత్ ప్రహిణోషి శస్త్రమ్ (4.18) అని యడుగగా,

'ఈదుష్టు లగుపాపాత్ములు మరణించిన నరకముల కేగుదురు. వీరి నుద్ధరించిన ప్రాపంచికకల్యాణమే గాక వీరికి నుత్తమగతులు గలుగవలె నని మీరు గోరు చుంటిరి గదా. అందువల్ల వీరిపై శస్త్రముల ప్రయోగించి, యుద్ధము చేసి, వీరిని సద్గతి నొందించితిని. వీరందరును వీరస్వర్గమును బొందె' గని భగవతి యుత్తర మిచ్చినది.

ఈసప్తశతిలో అద్వైతవేదాంతమునకు పెక్కు నిదర్శనము లున్నవి. నీవు. ఇంద్రాణి మొద లగువారిబలపరాక్రమములచేతనే యుద్ధము చేయుచుందు వని శుంభుడు చెప్పినట్లు 10వ అధ్యాయమున గనుపించును. ఈమాట విన్నంతనే ఆమె ఇంద్రాణి, వైష్ణవి మొద లగుదేవతలను తనలో లీనము చేసుకొనెను. అప్పుడు మహాసరస్వతియొక్క మూర్తి యొక్కటియే మిగిలినది. అప్పుడామె 'ఏ కై వాహం జగ త్యత్ర ద్వితీయా కా మ మాపరా' ఈజగత్తున నుండునది నే నొకతెనే. నేను తప్ప మరి యెవ్వరును లే రని చెప్పెను. ఇక్కడ చైతన్యదేవి శాంకరవేదాంతములోని మాయకంటే అభిన్న మైనది. ఈ విషయమును మొదటిఅధ్యాయమున సుమేధుడు స్పష్టపరచెను.

**మహామాయా హరే శ్చైషా, తయా సమ్మోహ్యతే జగత్!**
**జ్ఞానినా మపి చేతాంసి, దేవీ భగవతీ హి సా!**
**బలా దాకృష్య మోహాయ, మహామాయా ప్రయచ్ఛతి!**

భగవంతుడియోగమాయ జగత్తునే మోహింపజేయుచుండును. ఈదేవి జ్ఞానులచిత్తమును సైతము బలవంతముగా ఈడ్చి, మోహమున బడవేయు చున్నది. ఈవిషయమును వేదాంతదర్శనములోని **జన్మా ద్యస్య యతః** అను సూత్రము ప్రతిపాదించుచున్నది. ఈమాటనే బ్రహ్మ మొదటియధ్యాయమున చెప్పెను.

**త్వయైతత్ సృజ్యతే జగత్, త్వ యైతత్ పాల్యతే దేవి!**
**త్వ మత్స్యంతే చ సర్వదా,**

ఓ దేవీ! నీవే యీజగత్తును సృష్టించితివి. నీవే దీనిని పాలించితివి. కడకు నీవే నీలో లీనము చేసుకొనుచుంటివి. ఋగ్వేదములోని నాసదీయసూక్త వ్యాఖ్యానమే సప్తశతీప్రథమాధ్యాయము.

**య చ్చ కించిద్ క్వచిద్ వస్తు స దసద్ వాఖిలాత్మికే,**
**తస్య సర్వస్య యా శక్తిః సా త్వమ్** ఈమంత్రములోని సత్- అసత్ -

వస్తువులలోనిశక్తి ఆభగవతియే.

సప్తశతిలోని ప్రథమచరిత్రలో కర్మకాండ, మధ్యమచరిత్రలో ఉపాసనా కాండ, ఉత్తమచరిత్రలో జ్ఞానకాండ, లీలగా వర్ణించబడినవి. బ్రహ్మసూత్రముల లోని లోకా త్తు లీలాకైవల్యం అనుదానినిబట్టి చరిత్రత్రయములోని లీలాత్రయమున మార్మిక మగు ఆధ్యాత్మికరహస్య మవగత మగుచున్నది.

మేధ – ఋషి, సురథుడు – క్షత్రియుడు, సమాధి – వైశ్యుడు. బ్రహ్మ జానా తీతి బ్రాహ్మణః. బ్రాహ్మణునిపేరు మేధ. అనగా ఆత్మజ్ఞానము గలవాడు. ఇటులనే శాంకరభాష్యమునుబట్టి భగవద్గీతయు మేధయా? ఆత్మజ్ఞానలక్షణయా? ప్రజ్ఞయా? అని చెప్పినది..

**క్షరతి రక్షతి జనాన్, అధవా క్షతాన్ త్రాయతే ఇతి వా** – జనుల రక్షించువాడు. లేదా బాధపడువారిని కాపాడువాడు క్షత్రియుడు. క్షత్రియుని పేరు సురథుడు. సురథః సుష్ఠు రథ్యతే ఽ త్ర. అతః సత్యప్రవృత్తిమార్గపథకః సత్యప్రవృత్తిమార్గమున పయనించువాడు. దమంతే జన్మాని రథః శోభనో రథో యస్య సః సురథః శుభప్రద మైన రథము గలవాడని సప్తశతివ్యాఖ్య శాంతనవి వ్యాఖ్యానించినది.

సమాధిః సమా ధీయతే సర్వ మస్మిన్ అనగా సమా ధీయతే జన్మాని పురుషోపభోగాయ సర్వం ఇతి సమాధిః (శంకరభాష్యము) పురుషునిసుఖాను భూతి దేనియం దుంచబడినదో దానినే సమాధి యందురు. సమాధివల్లనే నివృత్తిమార్గమున పయనించువానికి (అనగా జిజ్ఞాసువుకు) జ్ఞానము గలుగు చున్నది. కావున ప్రవృత్తి నివృత్తిమార్గాధిపతులకు (జిజ్ఞాసువులకు) మేధ అనగా బుద్ధిని శరణు పొందుటయే శ్రేయస్కరము. మేధాఋషి – కర్మయోగి యగు క్షత్రియుని, జ్ఞానయోగి యగువైశ్యుని, పరాశక్తిని శరణు పొందు మని చేసిన ఉపదేశమును శ్రీకృష్ణభగవానుడు గీతలో అర్జునునికి చేసినఉపదేశముతో పోల్చవచ్చును. కాన సప్తశతీభగవద్గీతలు రెంటిలో బ్రహ్మవిద్య యొకటియే ప్రతిపాదింపబడినది.

## చరిత్రత్రయమర్మము : ప్రథమచరిత్రగాథ

స్వారోచిషమన్వంతరమున సురథు డనురాజు భూమండలము నేలు చుండెను. అతడు ధార్మికప్రవృత్తి గలవాడు. న్యాయశీలి. ఒకసారి విద్రోహు

లగుసామంతరాజు లందరు ఏకమై, యాతనిరాజ్యమును ముట్టడించిరి. విశ్వాస ఘాతకు లగుఅమాత్యులప్రవృత్తిని పసిగట్టి, రాజధానిని విడిచి, సురథుడు ఒంటరిగా అడవులకు పారిపోయెను. తిరిగి తిరిగి తుదకు ప్రశాంత వాతావరణము గల మేధాఋష్యాశ్రమము చేరి యచ్చటనే యుండెను. కొంత కాలమునకు సమాధి యనువైశ్యుడు అక్కడకు వచ్చెను. ఇతనిని లుబ్ధు లగు స్వకుటుంబపరివారము ఇంటినుండి వెడలగొట్టినది. ఈయిరువురు తమ సంకటపరిస్థితులకు వగచుచు, మేధాఋషిదగ్గరకు చేరి, తమదుఃఖస్థితిని వెళ్ళబోసుకోనుచు, మహాత్మా! సంసారము దుఃఖమయ మని బోధపడుచున్నను మోహ మేర్పడుచున్నదే యని యడుగ ఇందులో ఆశ్చర్యపడవలసినపని లేదు, భగవతి జ్ఞానులచిత్తము సైతము తనశక్తితో మోహపరవశము చేయుచున్నది. మీ రిరువురామెను శరణుపొందుడు. కోరికలు నెరవేర్చగలదని ప్రత్యుత్తర మిచ్చెను.

అప్పు డారాజు, వైశ్యుడు ఆభగవతి యెవరు? ఎట్లుండును? ఆమె స్వరూపస్వభావము లెట్లుండును? అని యడిగిరి.

ఆశివారూపిణి పరాశక్తి నిత్యయే. ఆమెశక్తి జగత్తంతయు వ్యాపించి యున్నది. అట్లు అయ్యు నామె యప్పుడప్పుడు దేవతలకార్యము నెరవేర్చుటకు ఆవిర్భవించుచుండును. దీనికి నిదర్శనమే ఈగాథ.

జలప్రళయానంతరము విష్ణువు శేషశయ్యపై నిదురించుచుండెను. అతని. కర్ణమలము(చెవిగుబిలి)నుండి మధుకైటభు లనురక్కసు లిరువురు విష్ణు భగవానునినాభికములనుండి యావిర్భవించినబ్రహ్మను చంపబోయిరి.

బ్రహ్మ భయపడి పరాశక్తిని పరిపరివిధములుగా బ్రార్థింపదొడగెను. మహామాయకు అతనిఆర్తనాదమును విన్నంతనే హృదయము ద్రవించినది. మహామాయ, మహామేధ, మహాస్మృతి మొద లగున వన్నియు జ్ఞాననామములు పతంజలి పేర్కొన్న ఋతంభరప్రజ్ఞయే. విష్ణుభగవానుడు సుషుప్త్యవస్థనుండి జాగ్రదవస్థకు చేరుకొనెను. లేచి యారాక్షసులతో యుద్ధము చేయబూనెను. యుద్ధ మరువదియారువేలయేండ్లవరకు సాగుచుండెను. రక్కసు లిరువు రలసట చెందక యుద్ధము చేయుచునే యుండిరి. మహామేధ వారిని బుద్ధిభ్రష్టులను గావించినది.

**క్రోధాద్ భవతి సంమోహః, సంమోహాత్ స్మృతివిభ్రమః,**
**స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో, బుద్ధినాశాత్ ప్రణశ్యతి.**

ఏపని యైనను ప్రసుప్తశక్తిని జాగృతపరచనిదే నెరవేరదు. ఈప్రస్తుప్తశక్తి ప్రతిప్రాణిలో కుండలినీరూపమున నున్నది. సృష్టిలో నుండునదియే సమష్టిలో నున్నది. ఆత్మశక్తిని పూర్ణచైతన్య మొనర్చుటయే కుండలినీయోగము. ఈయోగములో భౌతికదైవికాధ్యాత్మికసిద్ధులు కలుగుచున్నవి.

మూలప్రకృతి తమోగుణమున కధిష్ఠాత. ఆమెరూపము, కార్యము రెండు నాశ్చర్యకరములే.

**మధుకైటభులు –** అనగా సుకృతదుష్కృతములలో నిర్మమత్వము. వానిని నిర్మూలించుటకు గాని, నియంత్రించుటకు గాని ప్రయత్నము చేయవలె. మధు శబ్దమువల్ల కర్మఫలము వ్యక్త మగుచున్నది. **మధు విష్టం కర్మఫలం** అని కఠోపనిషద్వాక్యము వచించినది.

నిజమైనతత్వజ్ఞానము గలవారు ఎంతటిమహాపదల నైనను పరమాత్మ. ఆశీర్వాదముగా భావించి, సంతోషముగా ననుభ**వింతురు. వినా దుఃఖం సుఖం నోపలభ్యతే** – అనుసూక్తి యీగాథవల్ల స్పష్ట మగుచున్నది.

## ద్వితీయ చరిత్ర గాథ

ఒకానొకకాలమున మహిషు డనుఅసురు డుండెను. అతడు తనతపశ్శక్తితో నూరేండ్లవఱకు దేవతలతో యుద్ధము చేయుచుండెను. కడకు తనపశుబలముతో దేవతల నోడించి, పదచ్యుతులను గావించి, దేవలోకము నుండి వెడలగొట్టెను. అప్పుడు వారు పలువిధముల ప్రలపించుచు, బ్రహ్మదేవుని కడకు బోయి, తమగోడు వెళ్ళబోసుకొనిరి. ప్రజాపతియు వీరి నందరిని పిలుచుకొని హరిహరులసన్నిధిని చేరి, శరణు బొంది ఇట్లనెను..

మహిషాసురుడు ఇంద్రసూర్యాగ్నియమవరుణాదిదేవతల అధికారమును గ్రహించి, వెడలగొట్టెను. దిక్కు లేక తిరుగుచుంటిమి. అతని నెట్లైనను వధించు నుపాయ మాలోచించు మని మిమ్ము శరణుబొంది వేడుకొనుచుంటిమి. అని తమదుఃఖబాధ వెళ్ళబోసికొనిరి. దేవతలగోడు వినుచుండ త్రిమూర్తులముఖ మాగ్రహోదగ్ర మైనది. దేవతలందరినుండి తేజస్సు వెలువడి యామహాతేజస్సులో గలసి, యొకదివ్యమహాదేవిగా పరిణమించినది. ఆమెకు అమరు లందరు తమయస్త్రములు సమర్పించుకొని, సర్వాభరణముల నుపాయన మిచ్చిరి. హిమవంతుడు సింహమును వాహనముగా నిచ్చెను. ఆమహాశక్తి మహాతేజస్సుతో

దశదిశలు వ్యాప్తము లైనవి. ఆదివ్యదేవి తనసహస్రభుజములు నలువైపుల వ్యాపింపజేసి, అట్టహాస మొనరించినది. ఆయట్టహాసమును విని, మహిషాసురుడు 'ఆహా! ఎక్కడి దీభీకరాట్టహాసము' అనుచు ఆధ్వని వచ్చువైపే పరుగిడి, దేవిని గాంచి, యామెతో యుద్ధము చేయబూనెను. ఆసంగరమున మహిషాసురుని సేనానాయకులగు 1. చిక్షుర 2. చామర 3. ఉదగ్ర 4. కరాళ 5. ఉద్ధత 6. బాష్కల 7. తామ్ర 8. అంధక 9. ఉగ్రాస్య 10. ఉగ్రవీర్య 11. మహాహను 12. బిడాల 13. దుర్ధర 14. దుర్ముఖులు దేవీఖడ్గమున కాహుతి యైరి. సైన్య మంతయు నశింపగా, మహిషుడు స్వయముగా నామెతో యుద్ధము చేసి, హతు డయ్యెను. దేవత లానందించిరి. తమతమయధికారములను వశపరచుకొనిరి. అనంతరము దేవత లందరు గలిసి జగన్మాతను ప్రస్తుతించి వరములను బొందిరి.

దీనినిబట్టి దైవీశక్తిముందు ఆసురీశక్తి (పాశవికశక్తి) యేమియు చేయజాల దని స్పష్ట మగుచున్నది. దైవీశక్త్యుపాసకులకే విజయము తథ్య మని యీగాథ నిరూపించినది. పాశవికశక్తి తాత్కాలిక మైనదే, సంఘశక్తి దైవికము గావచ్చు, భౌతికము గావచ్చు, ఆధ్యాత్మికము గావచ్చు, అది సరి యైనస్థితిలో నున్నప్పుడే ప్రయోజనము సిద్ధించును.

ఈమధ్యమచరితము భారతీయుల ఐకమత్యఫలితమునకు నిదర్శనము.

దీనినిబట్టి యెంతటిదైవీశక్తిసంపన్ను లగుదేవత లైనను ఐశ్వర్య మదమత్తు లై గర్వాంధకారమగ్ను లైనపుడు పరాభవము పొందితీరుదు రని విశద మగుచున్నది.

## తృతీయ చరిత్ర గాథ

ఒకప్పుడు శుంభనిశుంభు లనునిరువురు రక్కసు లున్నారు. వారు అపారపరాక్రమ సంపన్నులు. తమపాశవికశక్తితో సురరాజగు దేవేంద్రునినుండి త్రిలోకాధిపత్యమును వశపరుచుకొనిరి. హవిర్భాగముల నమరులకు చెంద నీయక పరిగ్రహించుచుండిరి. దేవత లందరు కాందిశీకు లైరి. భగవతి యనుగ్రహించిన వరప్రదానమును స్మరించి, వారు హిమాలయమును చేరి, పరాశక్తిని స్మరించి, నమోవాకము లర్పించిరి. అదే మహాప్రభావసంపన్న మగు దేవీసూక్తము.

అమరులఆర్తిని గుర్తించి భగవతి పార్వతి సాక్షాత్కరించినది. మీరెవ్వరిని గూర్చి స్తుతించుచుంటి రన్నది. అప్పు డామెశరీరమునుండి యొకదేవి బయల్వెడలినది. వీరు శుంభనిశుంభులచే బాధింపబడుచు నన్ను స్తుతించు చుండి

రన్నది. పార్వతికోశమునుండి బయటికి వెడలివచ్చుటచే నాభగవతిపేరు శక్తి యైనది. ఆమె కృష్ణవర్ణ గాన కాళి యైనది.

కొంత సేపటికి శుంభనిశుంభులసేవకు లగు చండముండుల కంట బడినది. వారు ఈమెదివ్యసౌందర్యముకు ముగ్ధ లైరి. తమప్రభు వగుశుంభుని కడ కేగి, మహాప్రభూ! హిమాచలము పై నొకదివ్యవనిత కనిపించినది. ఆమె స్త్రీరత్నము. ముల్లోకములలోనిరత్నము లన్నియు మీకడ నున్నవి. మేము చూచిన స్త్రీరత్నము మీదగ్గఱ లేకపోవుట నీకు కొరతయే. మీ రారత్నమును బొంది, కొఱతను దీర్చుకొను డన్నది. శుంభు డామాటల నాలకించి, సుగ్రీవు డనువాని నామెకడకు దూతగా పంపెను.

దేవీసమీపమునకు బోయి అతడు శుంభుని ప్రస్తుతించి, యాతని పరిగ్రహించు మనెను. అంబిక యుద్ధమున తనను జయించినవానినే పతిగా బడయగల నని చెప్పినది. సుగ్రీవుడు పక పక నవ్వి, శుంభనిశుంభులచేతిలో దేవేంద్రుడు గూడ ఓడిపోయెను. అతనితో పంత మంత మంచిది గా దని పలికెను. భగవతి తాను పట్టినపట్టు విడువలేదు. సుగ్రీవుడు తమప్రభువుకడకు బోయి, మహాప్రభూ! ఆమె సామాన్యస్త్రీగా కనిపించుట లేదు. బలవంతముగా దీసుకొని వచ్చుటయే మంచి దని పలికెను.

రాజు ధూమ్రలోచనుని పంపెను. వాడు భగవతి హుంకారమంత్రము లోనే భస్మ మయ్యెను. వానివెంట వచ్చినసైన్యమును భగవతివాహన మగు సింహము సంహరించెను. పిదప చండముండులు గొప్పసేనతో వచ్చిరి. వారిని జూచి భగవతి యాగ్రహముతో మండిపడినది. అప్పుడామె మూడవకంటినుండి భయానకరూపిణి కాళిక ప్రాదుర్భవించి, చండముండులను సైన్యసమేతముగా వధించినది. చండముండులను వధించినందున కాళి చాముండ యైనది.

అటుల శుంభుడు అపారసేనావాహినితో, సప్తసేనానాయకులను వెంట బెట్టుకొని వచ్చి, సంగ్రామము చేయబూనెను. అప్పుడు బ్రాహ్మీ, వైష్ణవీ, మాహేశ్వరీ, ఐంద్రీ, వారాహీ, నారసింహీ, కౌమారీ శక్తులు రణరంగమున నవతరించినవి. అప్పు డంబికాశరీరమునుండి మహాభయంకరశక్తి బయలుదేరి వచ్చి, శివుని దూతను చేసి, శుంభునికడకు పంపినది. శివు డాతనికడకు జని, మీరు బ్రతుకదలచిన దేవతలఅధికారము వారికి స్వాధీనము చేసి, మీరు పాతాళము

చేరియుండుడు. కాకపోయిన రణరంగమున మీమీబలములను పంపు దని పలికెను. అహంకారమదాంధు డగుశుంభుని కీమాటలు చెవికెక్కునా? యుద్ధమునకు బయలుదేరెను.

అతనిసేనాధిపతి రక్తబీజుడు సులభముగా జచ్చువాడు గాదు. అతని యొక్కొక్కరక్తపుచుక్క నేలపై బడినవెంటనే దానినుండి, అతనితో సమానబల వంతులగు రక్తబీజులు పుట్టుదురు. రక్తబీజునిరక్తపుచుక్కలు రణభూమిపై బడుచుండ వేల, లక్షలసంఖ్యలో రక్తబీజులు పుట్టుచుండిరి. ఎంతమందిని చంపుచున్నను అంతకు వేయింతలు రక్తబీజులు ఏర్పడుచుండిరి. సంగ్రామరంగ మంతయు రక్తబీజులతో నిండిపోయెను. దీనిని గాంచి భగవతి యతనిరక్తపు బిందు వొక్కటియు భూమిపై పడకుండునట్లు నాలుకను జాచి, రక్తబీజుని రక్తమును పీల్చివేయ మని చాముండ నాదేశించెను. ఇట్లు చేయుటవల్ల వాడు చంపబడెను,

తరువాత నిశుంభుడు యుద్ధమునకు వచ్చి, యామెను గాంచి, నీవు పరులబలముతో గర్వపడుచుంటివి. అని పరిహసింపగా నామే ఓరీ! వీరందరు నావిభూతులే. వాస్తవమునకు నే నొకతెనే, యని పలికి తనవిభూతులను తనలోనే విలీనము చేసుకొని, యొంటరి యై, నిశుంభునితో యుద్ధము చేయుచు, భూమిపైనే గాక అంతరిక్షముననను సంగర మొనర్చి వానిని సంహరించెను.

దేవతలు మహదానందముతో భగవతిని ప్రస్తుతించిరి. ఆమె ప్రసన్నురాలై, వరమును కోరుకొను డన, లోకమున కీడు గలిగినపుడు నీవు మమ్ము రక్షింపుమని వేడుకొనిరి. అంబయు తథాస్తు అని భక్తసంరక్షణకై యేడుసార్లు అవతరింతు నని చండీస్తవమాహాత్మ్యము దెలిపి, యదృశ్య యైనది.

ఈచరితము జ్ఞానకాండకు దారిచూపుచున్నది. దీనినిబట్టి సాత్త్వికోపాసన అచిరకాలముననే ఫలించు ననియు, నదియే క్షేమకర మనియు, నిష్కర్షగా, చెప్పవచ్చును. ఈమూడుచరిత్రలును ఆధ్యాత్మికరహస్యములను తెలుపుచున్నవి.

సురథ – సమాధుల ఉపాసన, మేధాఋషి చండికాభగవతికి జెందిన గుణత్రయచరిత్రలను వినిపించి, చండీతత్త్వమును దెలిపి, **యథాభిమతధ్యానాద్వా** అనుపతంజలివచనానుసారము భుక్తిముక్తుల ననుగ్రహించుజగన్మాత నుపాసింపు డని సురథసమాధుల నాదేశించెను.

సురథరాజు, సమాధి వైశ్యుడు మహాదేవిని ప్రసన్నురాలిని చేసుకో నెంచి,

నదీతీరమున కఠినతప మాచరించిరి. ఇరువురియుపాసనలోను భిన్నత్వ. ముండెను. ఇరువురు నొకే పద్ధతి ననుసరించి యుపాసించి రని వ్రాసినను సమాధి మాత్రము దేవీసూక్తమునే ముఖ్యాంగముగా భావించి, సాధించినట్లు భావింపవచ్చును. ఆధ్యాత్మికదృష్టికోణములో జూచినప్పుడు దేవీసూక్తమును నిరంతరము జపించుట జ్ఞానయోగము గాక మరి యొకటి గానేరదు.

నిజగాత్రాసృగుక్షితం – తమరక్తమును బలి యిచ్చి రని చెప్పిరి. రక్తము వల్ల రజోగుణము వ్యక్త మగుచున్నది. రజోగుణమును బలి నీయక సాత్త్వికత పెంపొందదు.

ఆజగన్మాత వారితపస్సుకు సంతసించి, ప్రత్యక్షమై, వారు గోరిన వరముల ననుగ్రహించి, యదృశ్యురా లైనది. వైశ్యునికి బ్రహ్మజ్ఞానము నిచ్చి, ముక్తి ననుగ్రహించెను. క్షాత్రధర్మానుసారముగా సురథరాజుకు పోగొట్టుకొన్న రాజ్యమును ప్రసాదించి, జన్మాంతరమందు వివస్వంతునితనయుడుగా సావర్ణిగా జన్మించి, మనువు పదవి నందు మని యనుగ్రహించెను. రాజుకు గూడ ముక్తి యెందు కుండగూడ దనేసంశయము రాకమానదు.

**భోగైశ్వర్యప్రసక్తానాం, తయాపహృతచేతసామ్,**
**వ్యవసాయాత్మికా బుద్ధిః, సమాధౌ న విధీయతే.**

అని గీత. రజోగుణప్రధాను డగుసురథునికి ఆతడు గోరిన ఐశ్వర్యమునే ప్రసాదించెను.

**స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః** అనుగీతావచనమును బట్టియు **శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మాత్ స్వనుష్ఠితాత్** అనువాక్యమును దృష్టిలో ఉంచుకొని, స్వధర్మ మపి చావేక్ష్య – స్వధర్మమును గుర్తించి, సురథు డావరమునే కోరెను. స్వే స్వేకర్మ ణ్యభిరతః, సంసిద్ధిం లభతే నరః అను గీతాసూక్తినిబట్టి పరధర్మానుసరణమువలన తనప్రయోజనమును సాధింప జాలడు.

దుర్గాసప్తశతీగాథ అత్యంతహృదయంగమ మైనది. ఈకథాప్రవక్త మార్కండేయమహర్షి, మార్కండేయపురాణములో విశిష్టాంశ మిది. దీనిలోని సంఘటన లన్నియు చారిత్రకసత్యములే. ఈగాథయు యుగయుగములనుండి వ్యాప్తిలో నున్నది. ఈనాటికి మునుపటివలెనే ఆదరింపబడుచున్నది.

విద్వాంసు లెందరో ఈగ్రంథమును దార్శనికదృష్టిలో వ్యాఖ్యానించి,

సప్తశతీప్రాచీనవ్యాఖ్యాతలును చారిత్రకదృష్టిలోనే వ్యాఖ్యానించిరి. నాగోజీభట్టు – భాస్కరరాయ (గుప్తవతి), శంతనుచక్రవర్తి (శాంతనవి), రాజరామ (వంశోద్ధార), చతుర్ధరమిశ్ర (చతుర్ధరి), గోపాలచక్రవర్తి (తత్త్వప్రకాశిక), పంచాననతర్కరత్న (దేవీభాష్యము), మొద లగుటీకాకారు లెందరో ఉన్నారు. ఇవియే గాక కాశీనాథ గోవిందరామ - సిద్ధాంతవాగీశ - పుండరీకాక్ష - విద్యాసాగర - నరసింహచక్రవర్తులటీకలును లభించుచున్నవి. ఈటీకలో దార్శనికవిజ్ఞానవిషయమును అచ్చుటచ్చుట చర్చించదగినది. కాని సప్తశతి చరిత్రను నిలుపుటకు మాత్రమే ప్రయత్నము జరిగినట్లు లేదు. రాసమోహన చక్రవర్తి టీక లన్నిటి నాధారము చేసుకొని, ఆచరిత్రను చరిత్రగానే ప్రతిపాదించెను. బెంగాలీభాషలో శ్రీచండి అనుదానిని ప్రచురించిరి. అది చాలమందిని ప్రభావితులను చేసినది. కొన్నియేండ్లకు మునుపు బెంగాలీలో ఒకబ్రహ్మవేత్త యగుభక్తుడు చండీసప్తశతిని దార్శనికదృష్టితోనే వ్యాఖ్యానించెను. దానిని పెక్కురు విద్వాంసు లనుసరించిరి. కాని వారు వారివారిదృష్టినిబట్టే వివరించిరి. దుర్గాసప్తశతి నొకమానవీయరూపకముగా భావించినవారును లేకపోలేదు. యుగయుగముల నుండి సప్తశతి చారిత్రకగ్రంథముగా పరిగణింప బడుచున్నది. ఈదేశములోని మహర్షులు, పీఠాధిపతులు, అనుష్ఠాతలు, సాధకులు, భక్తులు, ఇప్పటిరూపమున దానిని గాంచినవారు గారు. కాని లోకకల్యాణదృష్టితో దానిలోనిప్రతిశ్లోకమునను శబ్దమునకు మంత్రరూపము, దానిద్వారా ప్రజలకు శ్రేయస్సును గలిగించు విధానమును స్పష్టపరిచిరి. ఈనాడు దీని నెవరును మానవీయరూపక మని చెప్పుటకు సాహసించుట లేదు.

దీనిలోనిప్రత్యక్షరము మంత్రమే. మననము చేయువానిని కాపాడు చున్నది. సాధకులకష్టముల దొలగించుచున్నది. ఆపదలను నివారించున్నది. సమస్త సంకటములను దూరము చేయుచున్నది. చాలమంది సప్తశతీ మంత్రానుష్ఠానముతో తమకోరికలను నెరవేర్చుకొనుచున్నారు. కొన్నియిండ్లలో సప్తశతీపుస్తకము నిత్యము పూజించుట గమనింపవచ్చును. సప్తశతిపుస్తకము సర్వవిధములుగాను సంరక్షించు ననువిశ్వాసముతో పసిపిల్లలతలవైపు పెట్టువారును లేకపోలేదు. నిజమున కింతటిమహిమ సప్తశతి కున్నది.

# దుర్గాసప్తశతి - దుర్గానామౌచిత్యము

దుర్గ అన్నపద మెంతో మధుర మైనది. స్ఫూర్తిదాయక మైనది. ఈ రెండక్షరముల నుచ్చరించుటవల్ల మనలో సుప్త మైయుండుశక్తి జాగృత మగుచున్నది. అంతరంగమున శాంతి యేర్పడుచున్నది. ఈపవిత్రనామము చెవుల బడినంతమాత్రములోనే మనలోని ఆసురీభావము కూడ గణగణ వణికి పరుగెత్తుటకు ప్రయత్నించును. దీనిని జపించుటవల్ల, అర్థము ననుసంధానము చేయుటవల్ల, ఆసురీసంపత్తి మృతప్రాయ మగుచున్నది. దీని నిదిధ్యాసవల్ల ఆసురీసృష్టియే నిర్మూల మగుచున్నది.

**దుర్గానామార్థము :** దకార, అకార, రేఫ, గకార, అవర్ణముల సంయోగములో దుర్గానామ మేర్పడుచున్నది.

**దైత్యనాశార్థవచనో దకారః పరికీర్తితః,**
**ఉకారో విఘ్న నాశస్య వాచకో వేదసమ్మతః.**
**రేఫో రోగఘ్నవచనో గ శ్చ పాపఘ్నవాచకః,**
**భయశత్రుఘ్నవచన శ్చాకారః పరికీర్తితః.**

దకారము దైత్యులను నాశము చేయును. ఉకారము అంతరాయముల (విఘ్నముల)ను శాంతింపజేయు ననుట వేదసమ్మతము. రకారము సమస్తరోగములను నశింపజేయును. గకారము పాపములను బరిహరించును. ఆకారము భయములను బారద్రోలును. శత్రువులను రూపుమాపును. ఈవిధ ముగా దుర్గానామము సార్థక మగుచున్నది.

1. దుర్గాత్ గమయ తీతి దుర్గా. 2. దుర్గాతం గమయతి – దూరయ తీతి దుర్గా. 3. దుర్దశాం గమయతి నాశయతి ఇతి దుర్గా. 4. దురాచారం దోషం వా గమయతి దూరం కరోతి ఇతి దుర్గా, ఇట్లు దుర్గాపద మెన్నో విధముల నిర్వచింపవచ్చును.

దుర్గాపదమునకు దూర్గా అనునది పర్యాయవాచకముగా నున్నది. దుర్గ పదములోనిహ్రస్వ మగుఉకారమే కొన్నిచోట్ల దీర్ఘ మగుఊకారముగా కన బడుచున్నది.

**దాంతబీజం సముద్ధృత్య వామకర్ణ (ఊ)విభూషితమ్** అని వామకేశ్వర తంత్రము చెప్పుచున్నది. వరదాతంత్రమును **'దుం దుర్గావాచకో దేవీ ఊకారో రక్షణార్థకః'** అని ఆభావమునే సమర్థించినది.

దూ – నామాన్ని – దేవతా చ జగద్ధాత్రీ, దుర్గా తత్ బీజవర్ణనాత్ అని బ్రహ్మసూత్ర ప్రాణాధికరణశక్తిభాష్యము ప్రవచించినది. ఇత్యాదిప్రమాణముల, వల్ల దుర్గానామము సమస్తపాపములను నశింపజేయు ననియు, మృత్యువును దూరము చేసి భయమును పోగొట్టు ననియు, శత్రువులను నశింపజేయు ననియు స్పష్ట మగుచున్నది. దుర్గ వాగాదిఇంద్రియములపాపము లన్నిటిని పరిహరించి మృత్యువును సైతము దూరముగా తరిమికొట్టుచున్నది.

ఇంతటిమహామహిమ గలిగినందువల్లనే ప్రభాతమున దుర్గాపదము నుచ్చరింపవలె నని చెప్పిరి.

**ప్రభాతే యః స్మరే న్నిత్యం దుర్గా దుర్గాక్షరద్వయమ్**
**ఆపద స్తస్య నశ్యంతి తమ స్సూర్యోదయే యథా ॥**

ప్రతినిత్యము ప్రభాతసమయమున దుర్గా దుర్గా యనురెండక్షరములను స్మరించువానిని సూర్యోదయసమయమునందు చీకటివలె ఆపద లన్నియు పటాపంచ లగును. సూర్యప్రకాశశక్తి అంధకారమును రూపుమాపునట్లు సర్వవ్యాపకమహాశక్తి యగుదుర్గాంబధ్యానము ఆపదలను దొలగించుటయే గాక, అవిద్యను పెంచు ఆసురీసంపత్తిని గూడ నశింపజేయును.

**దుర్గా దుర్గేతి దుర్గాయాః, దుర్గా నామ పరం మనుమ్ ।**
**యో యజతే సతతం, జీవన్ముక్తో న సంశయః ॥**

దుర్గా దుర్గా యనునామజపము చేయువాడు జీవన్ముక్తు డగు ననుటలో ఇంచుక కూడ సందేహము లేదని శంకరుడు పార్వతికి చెప్పెను.

రామ, నారాయణ, కృష్ణ, విష్ణు, శంకర, మొద లయినఅనేకనామమాల లోనిమణులలో దుర్గానామము మేరుపూసవంటిది. ఆయాదేవతల నామము లన్నిటికిని మహిమ గలదు. ప్రతినామమునకు వెనుక ఒకవిశిష్టగుణము ఉండి తీరును. దుర్గానామమున జగన్మాతకు సంబంధించిన సమస్తలీలలు, రూపము స్ఫురించును. రామ, కృష్ణ, శంకరాది నామములలో నొక్కక్కగుణము కనుపించును. (శంకరు డన్న సుఖమును కలిగించువాడు – హరి యన్న సమస్తపాపములను హరించువాడు.) కాని, దుర్గానామమున మాత్రము అసంఖ్యాకగుణము లుండుటవల్లనే ముండమాలాతంత్రము మొదలగుగ్రంథ ములు దుర్గానామమహిమను గొనియాడినవి.

**న హి దుర్గాసమం పూజా, న హి దుర్గాసమో జపః,**
**న హి దుర్గాసమం జ్ఞానం, న హి దుర్గాసమం తపః!**

దుర్గాపూజతో సమాన మైనపూజ గానీ, దుర్గానామజపముతో సమాన మయిన జపము గాని, దుర్గాజ్ఞానముతో సమాన మైనజ్ఞానము గాని, దుర్గను గూర్చినతపస్సుతో సమాన మైనతపస్సు గానీ లేవు.

దుర్గానామము సమష్టిగుణసంయుక్త మగుటవల్ల సమస్తసంప్రదాయముల వారికి నుపయోగపడుచున్నది.

**దుర్గాస్మరణజం దేవి! దుర్గాస్మరణజం ఫలమ్।**
**దుర్గాయాః స్మరణే నైవ, కిం న సిద్ధ్యతి భూతలే ॥**
**శైవో వా, వైష్ణవో వాపి, శాక్తో వా గిరినందిని!**
**భజేద్ దుర్గాం, స్మరేద్ దుర్గాం, యజేద్ దుర్గాం, శివప్రియామ్.**

పార్వతీ! దుర్గానామస్మరణతోనే సర్వము సిద్ధించుచున్నది. కాబట్టి శైవుడు గాని, వైష్ణవుడు గాని, శాక్తేయుడు గాని, యెవ్వ రైనను సరే, దుర్గను స్మరింపవలసినదే. పూజింపవలసినదే. అని శివుడు పార్వతికి చెప్పినట్లు ముండ మాలాతంత్రము వచించినది.

## దుర్గానామమహిమ

విపత్సాగరమును తరింపజేయుటకు దుర్గానామము నౌకవంటిది. దుర్గానామము సమస్తభయములను పోగొట్టును. అది లౌకికము గావచ్చును. ఆధ్యాత్మికము గావచ్చును. ఎంతటిదరిద్రస్థితి యైనను గావచ్చును. దుర్గా నామము నొకలక్షసార్లు జపించుటవల్ల అపద లన్నియు తొలగిపోవును.

దుర్గానామమువంటి నామ మింకొకటి లేదని, దానిని స్మరించినంత మాత్రముననే ఆపద లన్నియు దొలగిపోవు నని, పిచ్ఛిలాతంత్రము పేర్కొన్నది. ఆనామస్మరణచే ఆరోగ్యభాగ్యము చేకూరును. విజ్ఞానమున కానామమే ముఖ్యకారణము.

దేవీ! ఏభక్తు లైనను ప్రతిదినమును దుర్గామంత్రమును భక్తిశ్రద్ధలతో అష్టోత్తరశతము (108) జపించినవారు ధనవంతులు, పుత్రవంతులు, జ్ఞాన వంతులు, దీర్ఘాయుష్మంతులు, కడకు చిరంజీవు లగుదురు.

ప్రతినిత్యము వేయినూటయేబదిసంఖ్యలో జపించుధనార్థి ధనమును, జ్ఞానార్థి జ్ఞానమును బొందుచున్నారు. రోగార్తుడు రోగమునుండి ముక్తు డగును. బంధితుడు

బంధవిముక్తు డగును. భయపడువానికి భయము దొలగును. సమస్తపాపపరిహార మగును. పుత్రార్థి సుపుత్రవంతు డగును.

పరమేశ్వరీ! పదివేలసార్లు జపించువాడు నిగ్రహానుగ్రహసమర్థుడగును. శాపానుగ్రహసమర్థు డగును. సమస్తకర్మలను నెరవేర్చుటలో నిపుణు డగును. ఇతరులఅభీష్టములు నెరవేర్చుటలో కల్పవృక్షమువంటివా డగును.

నెలకు లక్ష జపించువానికి గ్రహపీడలు తొలగిపోవును. అతని కెప్పటికిని దరిద్ర ముండదు. సర్పచోరాగ్నిజలారణ్యాదులవలన భీతి గలుగదు. సింహవ్యాఘ్ర పిశాచముల భయముండదు. దుర్గానామమును జపించువాడు ఆచంద్ర తారార్కము స్వర్గసుఖముల ననుభవించగలడు.

దుర్గానామజపప్రభావమువల్ల ఒకసహస్రవాజపేయయజ్ఞములు చేసినఫలితము గలుగును. అందువల్ల ప్రయత్నించి యైనను సాధకు లీదుర్గా నామమును బఠించితీరవలెను. అని శివుడు దుర్గానామమహిమను పార్వతితో చెప్పినట్లు ముండమాలాతంత్రము పేరుకొన్నది. అంతే గాక

**విష్ణునామసహస్రేభ్యో, శివనా మైక ముత్తమమ్,**
**శివనామసహస్రేభ్యో దేవీనా మైక ముత్తమమ్.**

విష్ణునామములు వేయింటికంటే ఒక్కశివనామము మేలు. శివనామములు వేయింటికంటే దేవీనామము ఒక్కటి ఉత్తమ మని కూడ తెలిపినది.

దుర్గానామమును గూర్చి చెప్పినవిషయము లన్నియు అర్థవాదములు గాజాలవు. ప్రశంసామాత్రము లంతకంటెను గావు. సర్వవిధముల సత్యములే. అనుభవసిద్ధములే.

పద్మపురాణాదులును దుర్గానామముమహిమను వేనోళ్ల గొనియాడినవి.

ఈదుర్గానామము మహాసులభము. మహాఫలప్రదము నగుచున్నది. ఈజపసాధనతో మరొకటి సాటిరాదు, నియమనిష్ఠలలోను అంత కఠిన మైనది కాదు. కాన దుర్గానామము నందరు సర్వదా స్మరించుచుండవలెను.

ఈనామసాధన సమష్టిగాను జరుపవచ్చును. దానివల్ల లోకశాంతి చేకూరును. సమస్తశ్రేయస్సులు కలుగును.

**దుర్గాదేవి:** దుర్గాదేవి పూర్ణబ్రహ్మస్వరూపిణి. దుర్గామాత వాచాతీత పరాత్పరశక్తి, తాం దుర్గాం దుర్గమాం దేవీం నుమః – అను దేవ్యథర్వశీర్ష వాక్యమునకు అచ్చటనే ఇట్లు వ్యాఖ్యానము చేయబడినది. 'యస్యాః స్వరూపం

బ్రహ్మాదయో న జానంతి తస్మా దుచ్యతే అజేయా”. ఆమె స్వరూపము బ్రహ్మాదులును నెరుగరు. కావున – దేవి అజ్ఞేయ యైనది. ‘యస్యా అంతో న లభ్యతే తస్మా దుచ్యతే అనంతా’. ఆమె అంతము లభ్యము కాదు కావున ఆమె అనంత. ‘యస్యా లక్ష్యం నోపలక్ష్యతే తస్మా దుచ్యతే అలక్ష్యా” ఆమె తత్త్వ మెవరికి తెలియరాదు కావున దేవి అలక్ష్య. యస్యా జననం నోపలభ్యతే తస్మా దుచ్యతే అజా. జననము లేనిది గాన అజ. ‘ఏ కైవ సర్వత్ర వర్తతే తస్మా దుచ్యతే ఏకా’ అంతట నొంటరిగా నుండుటనుబట్టి ఏక. ‘ఏ కైవ విశ్వరూపిణీ తస్మా దుచ్యతే నైకా’ – అంతటను ఆమె యొక్కతెయే వర్తించుచున్నది కావున విశ్వరూపిణి. అత ఏ వోచ్యతే – అజ్ఞేయా, అనంతా, అలక్ష్యా, అజా, ఏకా, నైకా. కావున దుర్గయే అజ్ఞేయ, అనంత, అలక్ష్య, అజ, ఏక, అనేక, అగుచున్నది.

**మంత్రాణాం మాతృకా దేవీ, శబ్దానాం జ్ఞానరూపిణీ,**
**జ్ఞానానాం చిన్మయాతీతా, శూన్యానాం శూన్యసాక్షిణీ,**
**యస్యాః పరతరం నాస్తి, సైషా దుర్గా ప్రకీర్తితా॥**

మంత్రము లన్నిటికి మాతృక అనగా స్థూలాక్షరరూపముగా ఉన్నది దేవి. శబ్దములోనిజ్ఞానము అనగా అర్థరూపిణి. జ్ఞానములో చిన్మయాతీత జ్ఞానము. శూన్యములో శూన్యసాక్షిణి. మహాప్రళయానంతరస్థితిని శక్తిసంగమ మందురు. మహాప్రళయ మేర్పడినపు డంతయు శూన్యమే. అప్పటిస్థితియే శూన్యావస్థ. దానిని చూచునది. అనగా చిచ్ఛక్తిస్వరూపబ్రహ్మము. ఆమే మహా ప్రళయమునందు లయము గానేరదు. ఆమెను మించినపరతత్త్వమే లేదు. ఆమెయే దుర్గ యని అథర్వశీర్షము దుర్గను వ్యాఖ్యానించినది.

దుర్గ సర్వత్ర వ్యాపించియుండుమహాశక్తి. మహామాయ. సమస్త విశ్వమును తనలో నిముడ్చుకొన్నది. సమస్తతత్త్వనిలయ మామెయే. ఆమెను పరబ్రహ్మ – పరమాత్మ – మహేశ్వర – పురుష – ఇత్యాదినామములలో దేనితో పిలిచినను లక్ష్యమామెయే. ఈమెయే మూలప్రకృతి, భవతారిణి.

**దుర్గాసాకారధ్యానము :**

**విద్యుద్ధామసమప్రభాం మృగపతిస్కంధస్థితాం భీషణాం**
**కన్యాభిః కరవాలఖేటవిలసద్ధస్తాభి రాసేవితామ్**
**హస్తై శ్చక్రగదాసిఖేటవిశిఖాం చాపం గుణం తర్జనీం**
**బిభ్రాణా మనలాత్మకాం శశిధరాం దుర్గాం త్రినేత్రాం భజే॥**

దుర్గామాత - మెరుపుతీగవంటి కాంతి గలది. సింహవాహనము నధిష్ఠించినది. భయంకర మైనది. ఆయుధపాణు లైనకన్యలతో సేవించబడునది. శంఖ, చక్రములను, ఖేట, విశిఖములను, ధనుస్సును, ధరించునది. తర్జని చూపునది. అగ్నిస్వరూపిణి. చంద్రకళను ధరించినది. మూడు నేత్రములు గలది.

ఈదుర్గాభేదము లనేక మున్నవి. ధ్యానము భిన్నము. దుర్గ భోగమోక్ష ప్రదాయిని. పరబ్రహ్మప్రతిపాద్యదేవత. దుర్గతినాశిని. దుర్గారాధన వైదికసనాతన మార్గము. మానవమాత్రునికి అవశ్యకర్తవ్యము.

## దుర్గాసప్తశతి - నవార్ణమంత్రము

దుర్గాసప్తశతికి నవార్ణమంత్రము అంగము. పారాయణపరులు ఆమంత్రమును జపించవలెను. ఈమంత్రార్థమును తెలుసుకొని జపించుట ముఖ్యము.

ఇది తొమ్మిదక్షరములమంత్రము. బ్రహ్మ, విష్ణు, రుద్రులు మంత్రద్రష్టలు. గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్‌లు ఛందస్సులు. శ్రీమహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతులు దేవతలు. రక్తదంతిక, దుర్గ, భ్రామరులు దేవతలు. నంద, శాకంభరి, భీమ, శక్తులు. అగ్ని, వాయు, సూర్యులు తత్త్వము. శ్రీమహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ దేవతలప్రీతికై జపము.

ఈమంత్రమునకు ఏకాదశన్యాసము లున్నవి. వీటిని విధిగా చేయవలె ననుప్రమాణమును గలదు. మూలషడంగన్యాసము మాత్రమే చేయు వారున్నారు.

ఏకాదశన్యాసములలో మొదటిది మాతృకాన్యాసము. ఇదీ దేవీసారూప్య ప్రదము. 2. సారస్వతన్యాసము - జాడ్యవినాశకము. 3. మాతృగణన్యాసము - త్రైలోక్యవిజయప్రదము. 4. నందజాదిన్యాసము - జరామృత్యుహరము. 5, బ్రహ్మాదిన్యాసము-సర్వకామప్రదము. 6. మహాలక్ష్మ్యాదిన్యాసము - సద్గతిప్రదము. 7. మూలాక్షరన్యాసము - రోగక్షయకరము. 8. విలోమాక్షర న్యాసము - సర్వదుః ఖనాశకము. 9. మూలవ్యాపకన్యాసము - దేవతానుగ్రహ కరము. 10. మూలషడంగన్యాసము - త్రైలోక్యవశ్యకరము. 11. సూక్ష్మాదిబీజ త్రయన్యాసము - సర్వానిష్టహరము. సర్వాభీష్టదము. సర్వరక్షాకరము.

ఇంతటిసత్ఫలితము నిచ్చున్యాసములను నిర్లక్ష్యము చేయుచున్నారు. మంత్రదేవతాధ్యానము చేసి, మానసోపచారములు చేసి, జపమాలను ప్రార్థించి, నమస్కరించి, మంత్రార్థమును భావించుచు, జపము చేయవలె నని నియమము.

అర్థమును తెలిసికొని జపము చేయుట శ్రేయస్కరము.

**మంత్రార్థము:** ఒకసారి దేవత లందరు దేవీసాన్నిధ్యమునకు వెళ్లి, భగవతీ! నీవెవర వని ప్రశ్నింప నామె నేను బ్రహ్మస్వరూపిణిని. సగుణ, నిర్గుణ రూపములు రెండును నాయవియే యన్నది. ఆమాటల విన్నదేవతలు

**నమో దేవ్యై మహాదేవ్యై, శివాయై సతతం నమః!**
**నమః ప్రకృత్యై భద్రాయై, నియతాః ప్రణతాః స్మ తామ్.** అని ప్రణమిల్లిరి.

**నవార్ణమంత్రోద్ధారము –** దేవ్యథర్వశీర్షము

**వాఙ్మాయా బ్రహ్మసూ స్తస్మాత్ షష్ఠం వక్రసమన్వితమ్,**
**సూర్యో (అ)వామశ్రోత్రబిందుసంయుక్త ష్టాత్ తృతీయకః,**
**నారాయణేన సమ్మిశ్రో, వాయు శ్చాధరయుక్**
**తతః విచ్చే నవార్ణకో కర్ణ స్స్యాత్, మహదానందనాయకః॥**

ప్రతిపదార్థము వాక్ = వాగ్భవబీజం (ఐం) మాయా = (శక్తి హృల్లేఖా) (హ్రీం) ఇది శక్తిబీజము.

**వియదీకారసంయుక్తం, వీతిహోత్రసమన్వితమ్,**
**అర్థేందుకలితం దేవ్యా, బీజం సర్వార్థసాధకమ్.**

అని దేవ్యుపనిషత్తు వివరించినది.

అనగా వియత్ = హకారము. ఈకార(సంయుక్తం) = ఈ వీతిహోత్ర (సమన్వితమ్) = రకారముతో కూడినది. అర్థేందు(కలితమ్) = అనుస్వారముతో కూడినది. (హ్రీం) వీని నన్నిటిని కలిపిన హృల్లేఖాస్వరూప మగును. ఈశక్తి బీజమును హృల్లేఖ యందురు. దీనిని శుద్ధచిత్తు లగుయతులు జపించు చుందురు.

వేదము ఓంకారమునకు ఇచ్చినస్థానమును హ్రీం బీజమున కిచ్చినది. బ్రహ్మభూః = కామబీజము (క్లీం). తస్మాత్ = కామబీజములోని కకారమునుండి, షష్ఠం = ఆరవది అనగా చకారము. వక్ర (సమన్వితమ్) = ముఖము. ఆకారముతో కూడినది). (చ్+ఆ = చా) సూర్యం = మకారము. (మ్) అవామశ్రోత్రం = కుడిచెవి. ఉకారము. (మ్+ఉ) బిందుసంయుక్తః = బిందువుతో కూడినది. అనగా – ముం. టాత్ = టకారమునుండి, తృతీయకః = మూడవది. టకారమునుండి మూడవయక్షరము. (డ) , నారాయణేన = ఆకారముతో, సమ్మిశ్రః = మేళవించిన (డ్+ఆ = డా) వాయుః చ = యకారము, అధరయుక్ = ఐకారముతో కూడినది. అనగా (య్+ఐ) యై, విచ్చే = కడపట విచ్చే పదము జోడించి, నవార్ణకం =

చండీనవార్ణము.

అర్థః – స్యాత్ = మంత్రము అగుచున్నది. మహదానందదాయకః = అది మహదానందమును ప్రసాదించును.

**ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే** అనునక్షరములసమ్మేళనమే నవార్ణమంత్రము. ఇది ఉపాసకునకు మహదానందమును ప్రసాదించును. లేక బ్రహ్మసాయుజ్యము ననుగ్రహించును.

డామరాద్యనేకతంత్రములు ఈమంత్రార్థమును వివరించుచు, నీ మహిమను ప్రతిపాదించినవి.

**నిర్ధూతనిఖిలధ్వాంతే, నిత్యముక్తే పరాత్పరే!**
**అఖండబ్రహ్మవిద్యాయై, చిత్సదానందరూపిణి!**
**అనుసందధ్మహే నిత్యం, వయం త్వాం హృదయాంబుజే ॥**
**ఇత్థం విశదయ త్యేషాం, యా కల్యాణీ నవాక్షరీ।**
**అస్యా మహిమాలేశో ఽపి, గదితుం కేన శక్యతే।**
**బహూనాం జన్మనా మంతే, ప్రాప్యతే భాగ్యగౌరవాత్ ॥**
**ఏవ మర్థం గురో ర్లబ్ధ్వా, తస్మై దత్వా చ దక్షిణామ్!**
**అరిష్టం చ పదం లబ్ధ్వా, మంత్రసిద్ధి మవాప్నుయాత్ ॥**

నవార్ణమంత్రమును ఐం–హీం– క్లీం – చాముండాయై – విత్ చ ఈ – అని ఏడుపదముల భాగములుగ విభజింపవచ్చును. మొదటి మూడుబీజములు సంబోధనలు. చాముండాయై చతుర్థ్యంతము. విత్ – చ– ఈ, ఈమూడును సంబోధనలు. ఇట్లీమంత్రము ఐదుపదములుగా విభజింపబడును.

**వాగ్బీజము (ఐం) – చిద్రూపి ఐన సరస్వతికి బోధకము**

పరబ్రహ్మధర్మము సచ్చిదానందాత్మకము. దానిశక్తికి మూడు రూపము లున్నవి. మంత్రమందలి ఐం అనువాగ్బీజములో చిద్రూపిణి యగుసరస్వతి సంచరించుచున్నది. జ్ఞానముతోనే అజ్ఞానము నశించును. కాన పైమంత్ర వ్యాఖ్యలో నిర్ధూతనిఖిలధ్వాంత శబ్దములో చక్కనివివరణ స్పష్ట మైనది.

మాయాబీజము (హ్రీం) నిత్యత్వబోధకము. నిత్యత్వ మన త్రికాలాబాధ్యత. అనగా మూడుకాలములలో నుండుట, ముక్తత్వ మన కల్పిత వియదాదిప్రపంచ రాహిత్యము. కాన సద్రూపాత్మకమహాలక్ష్మీస్వరూపము హ్రీంకారములో సంచరించుచున్నది.

## కామబీజము (క్లీం) ఆనందరూపిణి. ఆనందబోధకము

పరాత్పరపదముతో బ్రహ్మానంద మనుఅర్థము గ్రహింపబడినది. అందువల్ల స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానందసంతతిః అనునామము బ్రహ్మాండ పురాణాంతర్గత మగు శ్రీలలితాసహస్రనామములో లలితామహాత్రిపుర సుందరిగా చెప్పబడినది. కాన పరాత్పరపదములో ఆనందప్రధాన మగు మహాకాళీస్వరూపము కామబీజము (క్లీం) సంచరించుచున్నది.

## చాముండా పదము నిర్వికల్పవృత్తబోధకము

చాముండాయై లోని చాముండా అనుపదము మోక్షకారణభూత మగు నిర్వికల్పవృత్తిని చెప్పుచున్నది. ఆపదమునకు తాదర్థ్యమున చతుర్థి యైనది. – చమూం వియదాదిసమూహరూపాం సేనాం దాతి లాతి (లడయో రైక్యమ్) ఆదత్తే, స్వాత్మసాక్షాత్కారేణ నాశయతి ఇతి వ్యుత్పత్తేః, పృషోదరాదిత్వాత్ సర్వం సుసంస్థమ్. అనగా వియదాదిప్రపంచపంచకసేనను నశింపజేయునది అని అర్థము.

**మయా త వ తోపహృతౌ చండముండౌ మహాపశూ!**
**యస్మా చ్చండం చ ముండం చ, గృహీత్వా త్వ ముపాగతా**
**చాముండేతి తదా లోకే ఖ్యాతా దేవీ భవిష్యతి ॥**

ఇచ్చట చండముండశబ్దములవలన మహాపశువు లగు చండముండులను గ్రహించి, వీరిస్థానమున తూల మూలము లను అజ్ఞానము (అవిద్యల) నశింప జేయుటవల్లనే చాముండా శబ్దమునకు బ్రహ్మవిద్య అనునర్థ మేర్పడినది.

ఇ – యనునది ఈ యనుదానిసంబోధన. దీనికి హే ఆనంద బ్రహ్మమహిషి అని యర్థము.

విత్ అనగా జ్ఞానము. హే జ్ఞానస్వరూపే! చ – నపుంసకపదము. దీనికి సత్య మని యర్థము. ఈవిధముగా హే మహాసరస్వతీ మహాలక్ష్మీ మహాకాళీ స్వరూపిణి! చండికే! మేము బ్రహ్మజ్ఞానముకు పొందుటకై నిన్ను ధ్యానించు చుంటిమి. ఇది నవార్ణమంత్రఫలితార్థము. ఈయర్థ మీక్రిందిశ్లోకమున చెప్పబడినది.

**మహాసరస్వతి! చితే! మహాలక్ష్మి! సదాత్మికే ।**
**మహాకా ల్యానందరూపే! తత్త్వజ్ఞానార్థసిద్ధయే ।**
**అనుసందధ్మహే చండి! వయం త్వాం హృదయాంబుజే॥**

శ్రీం – హ్రీం – క్లీం క్లీం – ఈబీజము లన్నియు నొక్కరూపము గలవే. మహాలక్ష్మికి శ్రీం బీజము ప్రసిద్ధ మైనది గాని, హ్రీం బీజము గాదు, అట్లయ్యును

శషసహా ఊష్మాణః అనుదాని ననుసరించి హకారషకారములు ఒకే జాతికి చెందియుండుటవలన అంతగా పెద్దభేదము గనిపించదు. అందువల్లనే శ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ అనియు, ఇంకొకశాఖలో హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ, శ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ తే పత్న్యౌ అనియు, మంత్రములో శ్రీం స్థానమున హ్రీం కనుపించుచున్నది. ఇట్లు కామబీజం క్లీం లోని లకారస్థానమున రేఫము – రకారము చేయుటవల్ల అనగా క్రీం యగుటవల్ల కాళీబీజ మగుచున్నది. యవరల –లు అంతస్స్థములు. ర–ల– రెండును అంతస్స్థము లగుటవల్ల ఎటువంటి భేదము కనిపించదు. తంత్రాంతరములలో కాళికి, సరస్వతికి అభేదము చెప్పబడినది.

చాముండా శబ్దమునకు మరొకఅర్థము చము అదనే అనుధాతువు నుండి చాముః పద మేర్పడినది. దానికి అదనీయపదార్థ మని యర్థము. ఆపదార్థము బ్రహ్మ దప్ప మిగిలిన దంతయు అత్తా చరాచరగ్రహణమ్. వ్యాకరణమున అత్తా అర్థము వ్రాసినచోటనే చాము అనుదాని కర్థము వ్రాయబడినది. అది బ్రహ్మసూత్రవిషయము గలది. చాముండా వయతీ ఉజ్జనయతి న విషయీకురుతే బ్రహ్మమంత్రవిషయి ణేతి యావత్. అని ఈపద మేర్పడినది.

ఏకాక్షరనిఘంటువు చకారమునకు చంద్రు డని యుర్థము చెప్పినది. చంద్రశబ్దము ఆహ్లాదక, ప్రకాశకగుణవాచకము. కాన నిచ్చట జ్ఞానము ఆనందము అనునర్థమున 'చ' గ్రహింపబడినది. ఆయానందస్వరూపము జ్ఞాన స్వరూప మగుబ్రహ్మమే.

**ఆసమంతాత్ ముండయతి ఇతి చాముండా** నలువైపుల నుండి బ్రహ్మమునకు వందనము చేయునది.

చాముండాపదమున కింకొకయర్థము చ శబ్దమునకు బుద్ధి యని, సుఖ మని, అర్థము లున్నవి. బుద్ధికి, సుఖమునకు ముండనస్థానీయ – శీర్ష స్థానీయము. శరీరమున శీర్షస్థానీయముగ నున్నది. శరీరమున శీర్షస్థాన మన్నిటి కంటే శ్రేష్ఠ మైనట్లే – చరమవృత్తిస్వరూప మగుబ్రహ్మవిద్యయే సర్వత్ర శ్రేష్ఠ మైనది.

చాముండాశబ్దమునకు అర్థము భగవతి చండికయే. కాన హోమ సమయమున ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే స్వాహా అని నవాక్షరమంత్రముపై స్వాహా కారము చేర్చుచున్నారు. మంత్రములోని 'యై' అన్న చతుర్థివిభక్తిబలముతో 'నమః' ప్రయోగ మగుచున్నది. మంత్రమందలి ఐం హ్రీం క్లీం అనుమూడక్షరములును అన్వయరూపములగు చతుర్థ్యంత ములుగనే శక్తిత్రయము

నైయున్నవి. మంత్రములో కడపటనుండు విచ్చే పదమును ప్రకృతిగణత్వాత్ అనునియమముతో అఖండ మగుఅన్వయ మగుచున్నది. మంత్రన్యాసప్రకరణమున విచ్చే ః కనిష్ఠికాభ్యాం నమః అని యొకపదమే గ్రహింపబడినది.

**నవార్ణమంత్రవిశిష్టార్థము :** 'ఓ మాతా! బంధనకారణభూత త్రిగుణాత్మక రజ్జుగ్రంథినుండి నన్ను విడిపించి, మోక్షము నిమ్ము' అని మొత్తముమీద మంత్రవిశిష్టార్థము. కాళ్యై లక్ష్మ్యై ... నమో అస్తు తే.

మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ స్వరూపిణీ! చండికా! భగవతీ! నీకు నమస్కారము. నాహృదయమం దుండు అజ్ఞానపాశగ్రంథిని విడిపించి, జననమరణములు లేకుండ చేసి, పరబ్రహ్మలో లీనము చేయుము.

దేవ్యథర్వశీర్షమున నవార్ణమంత్రోద్ధారానంతరము భగవతీవిద్యలో ఇట్లున్నది.

**హృత్పుండరీకమధ్యస్థాం, ప్రాతస్సూర్యసమప్రభామ్,**
**పాశాంకుశధరాం, సౌమ్యాం, వరదాభయహస్తకామ్,**
**నమామి త్వా మహం దేవీం, మహాభయవినాశినీమ్,**
**మహాదుర్గప్రశమనీం, మహాకారుణ్యవిగ్రహామ్,**
**యస్యాః పరతరం నాస్తి, సైషా దుర్గా ప్రకీర్తితా!!**
**తాం దుర్గాం దుర్గమాం దేవీం దురాచారవిఘాతినీమ్ ।**
**నమామి భవభీతో ఽ హం, సంసారార్ణవతారిణీమ్ ॥**

ఇట్లు అధర్వశీర్షము సమాప్తి యగుచున్నది. నవార్ణమంత్రవ్యాఖ్యయు సమాప్త మగుచున్నది.

**శుభమ్**

# ప్రత్యేక ధన్యవాదములు



బ్రహ్మశ్రీ అంబడిపూడి నాగభూషణం గారు నిగర్వి, మధురభాషి, శ్రేయోభిలాషి, పరోపకారి, నాకు ఆప్తుడు. ప్రథమంగా భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్ ద్వారా వేసిన 'శివపూజావిధానం', 'మహాగణపతి తత్త్వ వైభవం', 'చండీ సప్తశతి'లను వారు ఎంతో శ్రమకోర్చి ఈ పుస్తకాలను తయారుచేశారు. వారే ప్రూఫులు దిద్ది పుస్తకాన్ని చాలా సుందరంగా అచ్చు వేయించారు. వారి ఋణం తీర్చుకోలేనిది. వారి పేరు ఎక్కడా వేయనిచ్చేవారు కాదు. ఇటువంటి భాషా పండితుడు, పరోపకారి పరమపదించడం నాకే కాదు సాహిత్య లోకానికే తీరని లోటు. వారికి ఉత్తమ గతులు కలగాలని ఆ భగవంతుని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు

**బొల్లేపల్లి సత్యనారాయణ**

**భారతీధార్మికవిజ్ఞానపరిషత్**

# శ్రీ చండీసప్తశతీప్రస్తుతి

సమస్త మైనచరాచరసృష్టిజాతాని కంతటికీ ఆదీ, అనాదీ మూలాధారమూ అయినశక్తి ఆదిశక్తిగా, జగన్మాతగా, శ్రీదేవిగా ప్రస్తుతింపబడుతున్నది. సత్, చిత్, ఆనందస్వరూపిణి అయినఆశ్రీమాతను పలురూపాలతో, నామాలతో పలువిధాలుగా ఉపాసన చేసి, కామ్యాలు పొందీ, ముక్తిచెందీ, తరించటం ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ప్రసిద్ధం. చండీ, దుర్గా, లలితా, రాజరాజేశ్వరీ, కామేశ్వరీ మొద లైనపేర్లతో దేవీభాగవతం, లలితాసహస్రనామం మొద లైన వివిధగ్రంథాలద్వారా శ్రీదేవి భక్తులహృదయాలలో నిలిచింది. అందులో చండీ, దుర్గా అనేపేర్లతో శ్రీదేవి సప్తశతిద్వారా ఆరాధింపబడుతున్నది.

# శ్రీదేవీమాహాత్మ్యం

మందపాలుడు అనేముని పక్షిరూపం ధరించి, జరిత అనేపక్షివల్ల ద్రోణుడు అనేకొడుకును పొందాడు. ఈద్రోణుడు (భారతంలోని ఆచార్యద్రోణుడు కాదు) తార్క్షి అనేపక్షిని వివాహం చేసుకున్నాడు. వారికి కలిగిన పింగాక్షుడు, విరాటుడు, వృతుడు, సుముఖుడు అనేకొడుకులు త్రికాలజ్ఞులు. జైమినిమహర్షి వీళ్ళను ప్రశ్నించి తనసందేహాలను తీర్చుకోవడంవల్ల వీరిద్వారా ఈదేవీమాహాత్మ్యం ప్రకటిత మైంది.

మార్కేండేయపురాణంలో 78 అధ్యాయం నుంచి 90 అధ్యాయం వరకు 13 అధ్యాయాలు, 578 శ్లోకాలు శ్రీదేవీమాహాత్మ్యాన్ని వర్ణిస్తున్నాయి. **ఏత త్తే కథితం, భూప, దేవీమాహాత్మ్య ముత్తమమ్.** (13.2)

ఇందులో శ్రీదేవి అధికంగా చండి, దుర్గ అనేపేర్లతో ప్రస్తుతింపబడటం వల్ల ఇది దేవీ, చండీ, దుర్గా, మాహాత్మ్యంగా మూడుపేర్లతో పేర్కొనబడుతున్నది. ఇందులో కూడా చండీ, చండికా అనేపేర్లు పలుసార్లు ప్రస్తావింపబడుతూ ఈ గ్రంథం శ్రీచండీసప్తశతి, చండీస్తవం ఇత్యాదిగా చండిపేరుతో పిలవటం అధికంగా జరుగుతున్నది.

# శ్రీచండి

***– పరబ్రహ్మస్వరూపిణి***

చండభానుడు మొద లైనవాటిలో చండశబ్దం దేశ, కాల, వస్తు పరిచ్ఛేద త్రితయం లేనిదానిని బోధిస్తున్నది. ఇది బ్రహ్మలక్షణం. కాబట్టి చండశబ్దంనుంచి ఏర్పడిన **చండీ** శబ్దానికి పరబ్రహ్మస్వరూపిణి అని అర్థం. చండే చండిక.

చడి అనేధాతువుకి కోపం అర్థం. **'కస్య బిభ్యతి దేవా శ్చ జాతరోషస్య సంయుగే'**. భయహేతు వైనకోపం బ్రహ్మలక్షణమే. **'నమ స్తే రుద్ర మన్యవే'** అని కోపానికి నమస్కారంతోనే నమకం ఆరంభం అవుతున్నది. చడి ధాతువునుంచి ఏర్పడిన **చండీ** శబ్దానికి ఆవిధంగానూ పరబ్రహ్మస్వరూపిణి అని అర్థం.

***– పరబ్రహ్మపట్టమనిషి***

శుద్ధబ్రహ్మశక్తిపదార్థ మైన 'జ్ఞాన, ఇచ్ఛా, క్రియా' అనేమూడింటికి మహా సరస్వతి, మహాకాళి, మహాలక్ష్మి అనేవి నామాంతరాలూ, రూపాంతరాలు. ఆముగ్గురు దేవతలసమష్టి ఏకరూపమే నాల్గవది, చండి. అంటే చండి పరబ్రహ్మ పట్టమహిషి.

***– శ్రీమహాత్రిపురసుందరి***

**పరితుష్టా జగద్ధాత్రీ ప్రత్యక్షం ప్రాహ చండికా** (13–10) చండి నిర్గుణ చిద్రూపిణి మాత్రమే గాక సగుణరూపవతి కూడా.

**యా చిన్మయా పరా దేవీ త్రిపురా త్రివిధా (అ)భవత్...**
**తదా సా చిన్మయీ శక్తిః కాళీరూపా బభూవ హ.**
**సైవ కాలాంతరే లక్ష్మీ, స్త థైవ సరస్వతీ.**
**తాసాం కథానకం ....... మార్కండేయపురాణోక్తం స్తవం సప్తశతాభిధమ్ ॥**

అనేచిదంబరసంహితావచనాన్నిబట్టి శ్రీమహాత్రిపురసుందరీదేవే అసుర వధాధులకోసం కాళీ, లక్ష్మీ, సరస్వతీ రూపాలు ధరించింది. వారిచరిత్రే సప్తశతి. కాబట్టి చండి – శ్రీమహాత్రిపురసుందరి. **అపర్ణా చండికా చండముండాసురనిషూదినీ** అని లలితాసహస్రనామం.

***– గాయత్రి***

గాయత్రీవిసర్జనమంత్రంలో **'ఉత్తమే శిఖరే జాతే భూమ్యాం పర్వతమూర్ధని'** అని చెప్పబడింది. పర్వతమూర్ధని = మహామేరువుపై, ఉత్తమే శిఖరే = సహస్ర శృంగాలకంటే పై నున్నశృంగంపై, భూమ్యాం = శ్రీపురంలోనిచింతామణిగృహాగ్ర సౌధప్రదేశంలో ఉన్న, దేవీ = శ్రీరాజరాజేశ్వరి = శ్రీమహాత్రిపురసుందరి (గచ్ఛ = శ్రీపురానికి వెళ్ళు). లలితాసహస్రనామంలో **సుమేరుమధ్యశృంగస్థా శ్రీమన్నగరనాయికా** అని చెప్పిననామాలఅర్థమే ఇది. కాబట్టి గాయత్రియే మహాత్రిపురసుందరి. ఆమే చండి. కాబట్టి చండి గాయత్రీదేవియే అని ఫలితాంశం.

**– మహాలక్ష్మి**

**త్రిగుణా తామసీ దేవీ, సాత్త్వికీ యా త్రి థోదితా,**
**సా శర్వా చండికా దుర్గా, భద్రా భగవ తీర్యతే.** వైకృతికరహస్యం. 1

మహాకాళీ, మహాలక్ష్మి, మహాసరస్వతులు ముగ్గురు విడిగాను, సమష్టి అయిన నాల్గవశక్తీ చండికే. ఇలా చండి – బ్రాహ్మి, శైవి, వైష్ణవీశక్తి, సమస్తదేవీశక్తి స్వరూపిణి అవుతున్నది. **ఏకేన వా మధ్యమేన** అని సప్తశతిలో మధ్యమచరిత్ర ఒక్కటి మాత్రమే పారాయణం చేయవచ్చు. మిగిలిన ప్రథమ, ఉత్తమచరిత్రలకు లేని ఈమధ్యమచరిత్ర పారాయణం చండీపారాయణ మై, ఆచరిత్రకు దేవత అయినమహాలక్ష్మియే చండి అని విశేషంగా సూచిస్తున్నది. అంటే ఆముగ్గురు దేవతలసమష్టి అయిన నాల్గవరూపం మహాలక్ష్మి కూడా అవుతున్నది. కాబట్టి మహాలక్ష్మియే చండి.

**– సమస్త(స్త్రీ)దేవతాశక్తి**

చతుర్భుజ అయిన ఆదిమహాలక్ష్మి ధరించిన (మహాకాళీ, లక్ష్మి) సరస్వతి అనేరూపం పుట్టించిన (పురుషుడు విష్ణువు) స్త్రీరూపానికి **ఉమా గౌరీ, సతీ, చండీ, సుందరీ, సుభగా, శివా** అని (వైకృతికరహస్యం. 23) పార్వతినామాలలో చండీనామం ఉంది. మూర్తిరహస్యంలో శాకంభరిని గూర్చి **ఉమా, గౌరీ, సతీ చండీ, కాళికా, సాపి పార్వతీ** (16) అని చండీనామం ఉంది. అన్నీ చండికావతారాలే (ప్రాధానిక. 1) **చండికా ప్రాహ సత్వరా** (8.52) **దృష్ట్వా సా చండికా** (3.27). శుంభనిశుంభవధకారిణి అయిన మూడవచరిత్ర అధిదేవత శ్రీమహాసరస్వతి కాగా, అక్కడ సరస్వతీనామానికి బదులుగా కాళీనామం పర్యాయంగా చండికానామం (9.20, 26, 27, 30, 31

మొ॥) ప్రచురంగా కనబడుతున్నది. ఇలా ఇంకా ఆయాసందర్భా లన్నిటిని ఒకచోటికి తెచ్చుకొని చూస్తే చండి సమస్తస్త్రీదేవతాస్వరూపిణిగా తెలుస్తుంది.

## చండీప్రత్యక్షరూపం

చిత్స్వరూపిణి ఐన చండీరూపం ప్రత్యక్షంగా నిరూపింపబడినసందర్భాలు చాలా తక్కువ. బాహ్యంగా చండి శరీర, ఆభరణ, ఆయుధాదిఅంశాలు ప్రసిద్ధంగా లేకపోవటానికి చండి చిత్స్వరూపిణిగా, నిర్గుణగా నిరూపింపబడి ఉండటమే ప్రధానకారణం అనవచ్చు. ఒకచోట – రూపధ్యానచంద్రికలో చండిస్వరూపం ఇలా పేర్కొనబడింది.

**చండికా శ్వేతవర్ణా సా శివరూపా చ సింహగా,**
**జటిలా వర్తులా త్ర్యక్షా వరదా శూలధారిణీ,**
**కర్త్రికాం బిభ్రతీం దక్షే పాశపాత్రాభయాన్వితా.**

చండి శరీరంరంగు తెలుపు. శుభంకర మైనరూపం. సింహం వాహనం. జడలు కలిగిఉంటుంది. బొద్దుగా ఉంటుంది. మూడుకన్ను లుంటాయి. కుడి వైపున ఉన్న మూడుచేతులలో కిందినుంచి పైకి క్రమంగా 1. వరదముద్ర, 2. శూలం, 3. కత్తెర. ఎడమవైపు ఉన్న మూడుచేతులలో 1. అభయముద్ర, 2. పానపాత్ర, 3. పాశము ఉంటాయి. లలితాకోశంలో చండికి శిరసుపై చంద్రకళ కూడా ఉంది.

మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి స్వరూపాలూ ఆదిమహాలక్ష్మిరూపం వైకృతికరహస్యంలో స్పష్టంగా చెప్పబడ్డాయి.

## శ్రీచండీదేవీమాహాత్మ్యం

**మొదట నవశతి**

**నవశ్లోకశతాత్మికా విద్యా నవశతీ స్మృతా.** శ్రీచండీదేవీమాహాత్మ్యాన్ని వర్ణించే శ్లోకాలు మొదట 900 సంఖ్యలో ఉండేవి. అందుకే ఇది నవశతి అనేపేరుతో పిలవబడేది. శ్లోకసంఖ్యనుబట్టి ఈగ్రంథానికి నవశతి అనేపేరు కలిగింది. ఆ 900 శ్లోకాలలెక్క ఇది.

1. ఋషిప్రోక్తాలు - 560 **(శతాని పంచ షష్టిం చ శ్లోకానా మబ్రవీ దృషిః)**, 2. దేవతలు చెప్పినదేవీస్తోత్రశ్లోకాలు - 101 **(దేవీం ప్రతుష్టువు ర్దేవా ఏక శ్లోకశతేన చ.)**, 3. మార్కండేయుడు చెప్పినశ్లోకాలు - 78 **(మార్కండేయో అష్టసప్తత్యా)**, దేవి చెప్పినవి - 72 **(ద్విసప్తత్యా త థాంబికా)**, 4. చండముండులు చెప్పినని - 16½ **(సార్ధ షోడశభిః శ్లోకై శ్చండముండా వ థోచతుః)**, 6. శంభుడు చెప్పినవి - 16 **(శంభు షోడశభిః)**, 7. బ్రహ్మ - 14 **(బ్రహ్మా చతుర్దశభి రేవ చ)**, 8. దూత - 13 **(దూత స్త్రయోదశశ్లోకైః)**, 9. రాజు - 12 **(రాజా ద్వాదశభి స్తథా)**, 10. వైశ్యుడు - 8½ **(వైశ్య స్సార్ధాష్టభిః)**, 11. దైత్యుడు - 3 **(దైత్య స్త్రిభిః)**, 12. జైమిని - 2 **(ద్వాభ్యా మ థోదితః.)**, 13. వ్యాసుడు - 2 **(ద్వాభ్యాం చ జైమినిః, వ్యాసః)**, 14. కేశవుడు - 1 **(శ్లోకే నైకేన కేశవః)**, 15. మధుకైటభులు - 1 **(శ్లోకే నైకేన మధు కైటభౌ....నవశతీ స్మృతా.)** అలా దేవీమాహాత్మ్యన్ని వర్ణించేశ్లోకాలు మొత్తం 900.

**శివసంక్షిప్తం - సప్తశతి**

**నవశ్లోకశతాత్మకం తద్, విస్తృత మభూత్ కిల,**
**అత స్తత్సార ముద్ధృత్య, బ్రహ్మణే అర్పితవాన్ శివః,**
**స చ సప్తశతీ నామ్నా, విఖ్యాతో (అ)భూ ద్ధరాతలే.**

ఈ 900 శ్లోకాలగ్రంథం చాల విస్తృతంగా ఉన్న దని భావించి, శివుడు దానిలోనిసారాన్ని సంగ్రహించి, గ్రంథాన్ని తగ్గించి, బ్రహ్మకు అర్పించాడు. అలా తగ్గినది సప్తశతి అని ప్రఖ్యాత మైంది. ఈసప్తశతిలో శ్లోకాలు 578. అంటే నవశతిలోఉన్నశ్లోకాలు సుమారుగా 320 సప్తశతిలో తగ్గిపోయాయి.

ప్రాచీన మైన నవశతిపాఠంనుండి తొలగి నష్ట మైపోవడంవల్ల ఇప్పుడు ఆనవశతిస్వరూపం తిరిగి ఏర్పరచడం అసాధ్యం అనవచ్చు. అయినా కొందరు ప్రయత్నించి దేవీమాహాత్మ్యాన్ని నవశతిగా ప్రకటించారు. దీనికి నవశతి అనే పేరు శ్లోకసంఖ్యవల్ల ఏర్పడిం దని పైన స్పష్టంగా చెప్పబడింది. కాని అచ్చైనగ్రంథంలో శ్లోకాలు 900 లేవు. 900 శ్లోకాలలెక్క పైన చెప్పబడినవిధంగా ఋషిప్రభృతుల వాక్యాలుగా నేటినవశతులలో కనబడవు. మంత్రాలనుబట్టి నవశతి అన్నా, ఇందులో మంత్రాలు 921 దాక ఉండటం అలా ఉంచితే 160, 160-1, 160-2, మొద

లైనవిధంగా కొన్నిమంత్రాలు అనేకపర్యాయాలు ఒకేసంఖ్యతో నిర్దేశింపబడటం ఇందులో విచిత్రం. ఇంకా 103 – ఓం (ఘోర రాత్రి రసి) వంటి అమూలకమంత్రం మరీ వింత.

ఏ మైన ఒకప్పు డున్న దనుకున్నా, దేవీమాహాత్మ్యం నవశతిగా నేడు లభ్యం కాదు. నవశతిని పునరుద్ధరించేశ్రమకు సిద్ధపడినా, వ్యక్తులనుబట్టి వివిధరూపాలుగా తయారౌతుందే తప్ప యథార్థస్వరూపం మాత్రం నిశ్చయంగా దొరకదు. కాబట్టి దేవీమాహాత్మ్యం నేడు సప్తశతి మాత్రమే.

**చండీమాహాత్మ్యం – నవాధ్యాయమా?**

ఈదేవీమాహాత్మ్యం మార్కండేయపురాణంలో నేడు 13 అధ్యాయాలుగా కనబడుతున్నది. కాని ఈవిభాగం ప్రమాణరహిత మని భావించి, కొందరు ఇది 9 అధ్యాయాలగ్రంథంగా ఊహించారు. ఏకాదశరుద్రుల్ని అనుసరించి శతరుద్రీయం 11 అనువాకాలు అయినట్లే నవదుర్గ ననుసరించి నవ అధ్యాయాలుగా ఉండాలి. ఇంకా చండీమూలనవార్ణమంత్రం అక్షరసంఖ్య ననుసరించి కూడా అధ్యాయాలు 9గా ఉండడం యుక్తం అని వీరిఅభిప్రాయం. నమకం ఏకాదశానువాకాలతో ఏకాదశరుద్రులను ప్రస్తుతిస్తూ, పంచాక్షరీ మంత్రతత్త్వాన్ని బోధిస్తూ శివస్తుతి పరంగా ప్రసిద్ధం అయితే సప్తశతి శైలపుత్రి మొద లైననవదుర్గలను ప్రస్తుతిస్తూ, చండీనవార్ణమంత్రతత్త్వాన్ని బోధిస్తూ, దేవీస్తుతిపరంగా ప్రసిద్ధం. ఇలా నమకం సప్తశతి అనేవి రెండూ అర్ధనారీశ్వరుడి లాగ అవినాభావసంబంధంతో ఉన్నాయి.

13 అధ్యాయాలసప్తశతిలోని (3–4) (6–7) (9–10) (12–13) అధ్యాయాలు రెండు రెండు ఒక్కటిగా కలిసి, మొత్తంపై 4 అధ్యాయాలు తగ్గి దేవీమాహాత్మ్యం నవాధ్యాయం అయింది. కాని, ఇందులో శ్లోకాలే కాకుండా మంత్రాలు కూడా 700 లేవు. అందుచేత దీనికి సప్తశతి అనేపేరు కూడా కుదరదు. దేవీమాహాత్మ్యంగా మాత్రమే పేర్కొనబడే ఈనవాధ్యాయగ్రంథం ప్రసిద్ధ మైనసప్తశతి నామానికి కూడా దూరం కావడం విశేషం. విషయాన్నిబట్టి ఈవిభాగంలో దోషం కనబడకపోయినా, పండితులు తమపాండిత్యాన్ని అనుసరించి ఔచిత్యవంత మని భావించి, యథేచ్ఛగా ప్రాచీనసంప్రదాయాలను మార్చుకోవడం సమంజసం కాదనిపిస్తుంది. (శృంగేరీ శ్రీవిరూపాక్షపీఠంప్రతి.మొ.)

**13 అధ్యాయాలే**

ఏ మైనా, దేవీమాహాత్మ్యం సప్తశతిగా 13 అధ్యాయాలగ్రంథంగా మాత్రమే ప్రసిద్ధ మై ప్రచారంలో ఎప్పటినుంచో ఉంది. ఎంతటివా రైనా, ఏయుక్తులతో నైనా, దానిస్వరూపానికి మార్పును ప్రతిపాదిస్తే అది ఆదరింపబడటం, క్షుణ్ణ మైన ప్రాచీనసంప్రదాయం తిరస్కరించడం సాధ్యం కాదు. అందులోనూ సప్తశతి వంటి పలువురికి నిత్యోపాసనలో ఉండి, కామ్యాదిసాధక మైన ఉత్తమఉపాస్యగ్రంథంలో ఎటువంటి మార్పైనా విపరీత మనిపించేది ఏర్పడటం అసంభవం.

**చండీమాహాత్మ్యం – చరిత్రత్రయం**

సప్తశతిలో శ్రీదేవీచరిత్ర మూడుఅంశాలతో దేవీమాహాత్మ్యాన్ని ప్రతిపాదిస్తున్నది.

1. **ప్రథమచరిత్ర (మధుకైటభవధ) :**

**ప్రథమం చరితం ప్రోక్తం, మధుకైటభఘాతనమ్,**
**అ త్రాద్యచరితం నామ, ప్రథమాధ్యాయసంజ్ఞకమ్.**

మధుకైటభవధను వర్ణించే మొదటిఅధ్యాయం ప్రథమచరిత్ర. యోగనిద్రగా కనిపించేమహాకాళి ప్రథమచరిత్రకు దేవత. ఐం బీజం. వాగ్భవాత్మకం. అగ్ని తత్త్వం. ధర్మార్థం వినియోగం. సృష్టి రూపం. ఇందులో శ్లోకాలు 78, మంత్రాలు 104.

**ప్రథమే చరితే చాత్ర ప్రథమాధ్యాయసంజ్ఞకే,**
**శ్లోకానా మష్టసప్తత్యా చతుర్భి రధికం శతమ్.**

2. **మధ్యమచరిత్ర (మహిషాసురవధ) :**

**మహిషాసురనిర్ణాశం, చరితం విద్ధి మధ్యమమ్,**
**మధ్యమచరితం ప్రోక్త, మధ్యాయై స్త్రిభి రేవ చ.**

మహిషాసురవధను వర్ణించే 2, 3, 4 అధ్యాయాలు రెండవఅంశం. దీనిని మధ్యమచరిత్ర అంటారు. అష్టాదశభుజ అయినమహాలక్ష్మి మధ్యమచరిత్రకు దేవత. హ్రీం బీజం. హృల్లేఖాత్మకం. వాయుతత్త్వం. అర్థార్థం వినియోగం. స్థితిరూపం. ఇందులో శ్లోకాలు 145, మంత్రాలు 155.

**మధ్యమే తు చరిత్రే తు, పంచాశ చ్ఛ శతోత్తరమ్,**
**తథా పంచయుతం మంత్రా, మహాలక్ష్మ్యా విభేదతః.**

**3. ఉత్తమచరిత్ర (శుంభనిశుంభవధ) :**

**చరితం చోత్తరం విద్ధి, నిశుంభాదివధాశ్రితమ్,**
**ఉత్తమం చరితం దేవి, నవభిః పరికీర్తితమ్.**

శుంభనిశుంభవధను వర్ణించే మిగిలిన 5 నుండి 13 వరకు ఉన్న 9 అధ్యాయాలు మూడవఅంశం. దీనిని ఉత్తమచరిత్ర, ఉత్తరచరిత్ర అంటారు. కౌశికి (పార్వతీశరీరకోశ సముద్భూత) అయిన శ్రీమహాసరస్వతి ఈఉత్తరచరిత్రకు దేవత. క్లీం బీజం. కామరాజాత్మకం. సూర్యతత్త్వం. మోక్షార్థం వినియోగం. లయ రూపం. ఇందులో శ్లోకాలు 356, మంత్రాలు 441.

**చరిత్రే చోత్తరే మంత్రా, స్తంత్రే కాత్యాయనే స్థితాః,**
**ఏకచత్వారింశోత్తరా, శ్చతుశ్శతకసంఖ్యకాః.**

ఇలా 1. మహాకాళి, 2. మహాలక్ష్మి, 3. మహాసరస్వతి అనేముగ్గురు దేవతలమాహాత్మ్యవర్ణనంగా మూడుచరిత్రలతో మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ స్వరూపిణిగా సప్తశతీతత్త్వం చండీతత్త్వంగా ఈచరిత్రత్రయంతో ప్రకటిత మవుతున్నది.

**11, 12, 13 అధ్యాయాలు - రహస్యత్రయం**

ఇందులో 5 నుండి 10 వరకు ఆరు అధ్యాయాలు మాత్రమే ఉత్తమచరిత్ర అని మిగిలిన 11, 12, 13 అధ్యాయాలు మూడూ రహస్యత్రయం అని ఒకమతం కనిపిస్తున్నది. 10వ అధ్యాయంతో కథాంశం శుంభనిశుంభవధ పూర్తి అవుతుంది. కాబట్టి మిగిలినఅధ్యాయాలు రహస్యత్రయంగా వీరు భావించి ఉండవచ్చు. (దీనివల్ల సప్తశతి 13 అధ్యాయాలు మాత్రమే పూర్తి పారాయణం అవుతుంది. కాని ఈమతం సర్వసమ్మతం కాలేదు.)

పదవఅధ్యాయంతో శుంభనిశుంభవధ అయింది. రాక్షససంహారం చేసిన దేవిని దేవతలు స్తుతించడం దేవతలను శ్రీదేవి అనుగ్రహించడం, (11 అధ్యాయం) శ్రీదేవీమాహాత్మ్యఫలశ్రుతి (12 అధ్యాయం), దేవీవరప్రదానం (13 అధ్యాయం) అనేమిగిలిన 3 అధ్యాయాలు రహస్యత్రయంగా, ప్రత్యేకన్యాసంతో పేర్కొనడం కనిపిస్తుంది.

**– *(రహస్యత్రయ)న్యాసం***

*ఏకాదశాధ్యాయం :* అథ ఏకాదశాధ్యాయాంతర్గతప్రథమరహస్యస్య బ్రహ్మాత్మా భగవాన్ సుమేధా ఋషిః, గాయత్రీ ఛందః, మహాదుర్గా దేవతా,
ఐం బీజం, రం భూః తత్త్వం. మమ ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థే జపే వినియోగః।
హ్రాం - హ్రీం - హ్రూం - హ్రైం - హ్రౌం - హ్రః - అనేవాటితో కరహృదయాదిన్యాసం.
భూ ర్భువ వ స్సువ రో మితి దిగ్బంధః.
ధ్యానమ్ :

వరాంకుశౌ పాశ మభీతిముద్రాం, కరై ర్వహంతీం కమలాసనస్థామ్
బాలార్కకోటిప్రతిభాం త్రిణేత్రాం, భజే ౽హ మంబాం జగదీశ్వరీం తామ్.

లం-గంధం, హం-పుష్పం, యం-ధూపం, రం-దీపం, వం- అమృతనైవేద్యం సం-సమస్తోపచారాన్ సమర్పయామి. (అని పంచపూజ చేసి)
ఏకాదశాధ్యాయాంతర్గతప్రథమరహస్యపారాయణం కరిష్యే.

(అని సంకల్పించి, తర్వాత 11 అధ్యాయం పారాయణం చేయాలి).

*ద్వాదశాధ్యాయం :* ద్వాదశాధ్యాయాంతర్గతద్వితీయరహస్యస్య విష్ణ్వాత్మకో భగవాన్ సుమేధా ఋషిః. ఉష్ణిక్ ఛందః, బాలసరస్వతీ దేవతా, క్లీం బీజం.
యం భువః తత్త్వమ్. ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థే జపే వినియోగః.
క్లాం - క్లీం - క్లూం - క్లైం- క్లౌం- క్లః - (అనేవాటితో కరహృదయాదిన్యాసం.)
భూ ర్భువ స్సువ రో మితి దిగ్బంధః.
ధ్యానమ్ :

వరదాభయపుస్తకాక్షమాలావిలసత్పాణిసరోజభాసమానామ్,
శరదిందుసహస్రకోటిరూపాం పరమానందమయీం ప్రణమామి బాలామ్.

లం-గంధం, హం-పుష్పం, యం-ధూపం, రం-దీపం, వం - అమృతనైవేద్యం, సం - సమస్తోపచారాన్ సమర్పయామి. (అని పంచపూజ చేసి)
ద్వాదశాధ్యాయాంతర్గతద్వితీయరహస్యపారాయణం కరిష్యే.

(అని సంకల్పించి 12 అధ్యాయం పారాయణం చేయాలి).

*త్రయోదశాధ్యాయం :* త్రయోదశాంతర్గతతృతీయరహస్యస్య రుద్రాత్మకో భగవాన్ సుమేధా ఋషిః. అనుష్టుప్ ఛందః. శ్రీమహాత్రిపురసుందరీ దేవతా, సౌః బీజమ్. హ్రీం శక్తిః. హం సువః తత్త్వమ్. ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థే జపే వినియోగః.

**హంసాం, హంసీం, హంసూం, హంసైం, హంసౌం, హంసః**

(అనేవాటితో కరహృదయాదిన్యాసం) **భూ ర్భువ స్సువ రో మితి దిగ్బంధః**

**ధ్యానం : అకలంకశశాంకాభా త్ర్యక్షసూత్రకళావతీ**

**ముద్రాపుస్తకహస్తాఢ్యా పాతు మాం పరమా భవా.**

**లం - గంధం, హం - పుష్పం, యం - ధూపం, రం - దీపం, వం - అమృతనైవేద్యం, సం - సమస్తోపచారాన్ సమర్పయామి.** (అని పంచపూజ చేసి) **త్రయోదశాధ్యాయాంతర్గతతృతీయరహస్యపారాయణం కరిష్యే.**

(అని సంకల్పించి 13 అధ్యాయం పారాయణం చేయాలి).

దీనివలన ప్రాధానికరహస్యాదులప్రస్తావన ఈప్రణాళికలో లే దనవలె.

***- అంతా ఒకటే (చండీ) చరిత్ర***

అయితే 1. ఇందులో మొదటిచరిత్ర కాళీచరిత్ర. కాగా అది మూడవ చరిత్రకు సంబంధించదగిన **ఐం** అనేవాగ్బీజసంబంధి కావడం 2. ఇది మూడు చరిత్రలుగా గానీ, లేదా ఆయాభాగాలు మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతులకు సంబంధించినవి అని గానీ అందులో స్పష్టంగా చెప్పబడకపోవడం 3. మూడవ చరిత్ర అయిన శుంభనిశుంభవధలో మహాకాళీనామమే పలుసార్లు ప్రస్తావింపబడి మహాసరస్వతినామం ప్రత్యేకంగా కనబడకపోవడం - మొద లైన కొన్ని కారణాలను బట్టి సప్తశతిని చరిత్రత్రయంగా గానీ, మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతులపేర్లతో గాని, పేర్కొనడానికి తగినప్రమాణం లే దని కొంద రంటారు. వారిదృష్టిలో సప్తశతి ఆమూలాగ్రంగా ఒకే చండీదేవీమాహాత్మ్యం. అంశత్రయాది భాగాలు లేవు. వారి దృష్టిలో రహస్యత్రయాదులప్రస్తావన కూడా ఉండదు.

***చరిత్రత్రయం***

కానీ, కాత్యాయనీతంత్రాదులలో విస్తృత మైననిరూపణతో ప్రచుర ప్రచారంలో ఉన్నదీ, ఆర్షసంప్రదాయ మనదగినదీ, అయినప్రస్తుతవిధానం ఇటువంటి కారణాలతో కాదనరాదు. తద్జ్ఞులు సూక్ష్మంగా పరిశీలించి చెప్పగలరు

మొత్తంపై దేవీమాహాత్మ్యం 13 అధ్యాయలతో, 3 చరిత్రలతో, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి అనేముగ్గురుదేవతలవ్యష్టిచరిత్రగా, సమష్టిగా చండీ(దేవీ)మాహాత్మ్యంగా, సప్తశతిగా ఉపాసింపదగినది.

# సప్తశతివైశిష్ట్యం

**– అపౌరుషేయం**

**యథా వేదో హ్యనాది ర్హి తద్వత్ సప్తశతీ స్మృతా.** (భువనేశ్వరీసంహిత) వేదంలాగానే సప్తశతి కూడా అనాదీ, అపౌరుషేయమూ. ఋషులు మంత్రాలను దర్శించినవాళ్ళే గాని సృష్టించినవాళ్ళు కాదు. వ్యాసుడు దర్శించి, ప్రకటించాడు గాబట్టి మాత్రమే సప్తశతి వ్యాసకృతం అంటున్నారు.

**– తత్త్వం సామాన్యులకు అజ్ఞేయం**

**సప్తశత్యా శ్చ సకలం, తత్త్వం వే ద్మ్యహ మేవ హి,**
**పాదోనం శ్రీహరి ర్వేత్తి, వేత్త్యర్ధం తు ప్రజాపతిః,**
**వ్యాస స్తుర్యాంశకం వేత్తి, కోట్యంశ మితరే జనాః.** (మేరుతంత్రం)

సప్తశతీతత్త్వం పూర్తిగా తెలిసినవాడు పరమేశ్వరు డొక్కడే. విష్ణువుకు మూడు వంతులు తెలిస్తే, బ్రహ్మకు సగం మాత్రమే తెలుసు. వ్యాసుడికి తెలిసింది నాలుగో వంతే. ఇక మిగిలినవాళ్ళకు కోటివంతు మాత్రమే తెలుస్తుంది.

**య థాశ్వమేధః క్రతుషు, దేవానాం చ యథా హరిః,**
**స్తవానా మపి సర్వేషాం, తథా సప్తశతీస్తవః.**

యాగాల్లో అశ్వమేధమూ, దేవతల్లో విష్ణువూ లాగా, స్తోత్రాల్లో సప్తశతి శ్రేష్ఠం అని డామరతంత్రం.

# సప్తసతి

దీనికి సప్తశతి అనేప్రసిద్ధనామంతోపాటు సప్తసతి అనేపేరు కూడా ఉంది. **1. మహావిద్యా 2. మహామాయా 3. మహామేధా 4. మహాస్మృతిః 5. మహామోహా చ భవతి 6. మహాదేవీ 7. మహాసురీ.**

**మహావిద్యా – ఇత్యాది సప్తశక్తయో బ్రహ్మణా స్తుతాః,**
**తస్మాత్ సప్తస తీ త్యేవం, ప్రోక్తా వ్యాసేన ధీమతా.**

మహావిద్య మొద లైన 7 శక్తులు బ్రహ్మచే స్తుతింపబడడంవల్ల దీనికి సప్తసతి అనేపేరు కలిగింది.

అందులో ప్రథమచరిత్రంలో **1. కాళీ 2. తారా 3. ఛిన్నమస్తా 4. సుముఖీ 5. భువనేశ్వరీ 6. బాలా 7. కుబ్జా** (ఇతి మనవ స్సూచితా స్సంప్రకీర్తితాః అని ఏడుగురూ,

అలాగే మధ్యమచరిత్రంలో **1. లక్ష్మీ శ్చ 2. లలితా 3. కాళీ 4. దుర్గా 5. గాయత్రీ 6. అరుంధతీ 7. సరస్వతీ** (చేతి సప్తశక్తయః పరికీర్తితా) అని ఏడుగురూ,

అలాగే ఉత్తమచరిత్రంలోనూ

**బ్రహ్మాణ్యాదాః సప్తసంఖ్యా ,శ్చాముండాంతాః ప్రకీర్తితాః,**
**సత్యః ప్రోక్తాః స్వయం దేవ్యా, స్తస్మాత్ సప్తసతీ స్మృతా.**

అని **1. బ్రహ్మాణి 2. మాహేశ్వరి 3. కౌమారి 4. వైష్ణవి 5. వారాహి 6. నారసింహి 7. చాముండ** అనే ఏడుగురు సతులు స్తుతింపబడ్డారు. కాబట్టి ఇది సప్తసతి అయిం దని మేరుతంత్రం.

అలాగే మొత్తం మూడుచరిత్రలలోనూ కలిపి 3×7=21 శక్తులసమష్టి రూపాత్మక లైన 1. నందా 2. శతాక్షీ 3. శాకంభరీ 4. భీమా 5. రక్తదంతికా 6. దుర్గా 7. భ్రామరీ అనే ఏడుగురుసతులు చెప్పబడ్డారు.

ఇన్నివిధాలుగా ఇందులో "సప్తసతులు" ప్రతిపాదింపబడటంవల్ల ఈగ్రంథం సప్తసతి అయిం దని మేరుతంత్రం స్పష్టం చేసింది.

## సప్తశతి

**మార్కండేయపురాణోక్తం స్తవం సప్తశతాభిధమ్,**
**తస్మిన్ దేవ్యా స్తువే పుణ్యే మంత్రాః స్సప్తశతం శివే!**

**మంత్రాలు 700**

సప్తశత – 700సంఖ్య గలమంత్రాలు కలిగింది కాబట్టి దీనికి సప్తశతి అని పేరు. అయితే ఈ 700 సంఖ్య ఎలా అనేవిషయంలో మతభేదాలు కనబడుతున్నాయి.

**అష్టసప్త త్యుత్తరణాం, శ్లోకానాం శతపంచకమ్,**
**ప్రోక్తం సప్తశతీస్తోత్రం, తత్ సప్తశతసంఖ్యయా.** (కాత్యాయనీతంత్రం)

దీన్నిబట్టి దేవీమాహాత్మ్యంలో శ్లోకాలు 578. యామళతంత్రం 579,

వారాహీతంత్రం 588 శ్లోకా లనీ చెప్పాయి.

శ్లోకాలు సుమారుగా 580 మాత్రమే అయినా ఈభాగంలో మంత్రాలు 700 కాబట్టి ఇది సప్తశతి.

**శ్లోకాలు, అర్ధశోకాలు, ఉవాచలూ :**

| | | |
|---|---|---|
| ప్రథమచరిత్రలో (1 అధ్యాయంలో) | 66 + 24 + 14 | = 104 |
| మధ్యమచరిత్రలో (2–5 అధ్యాయాలలో) | 144 + 2 + 9 | = 255 |
| ఉత్తమచరిత్రలో (6–13 అధ్యాయాలలో) | 325 + 6 + 34 | = 441 |
| మొత్తం | | = 700 |

**(కవచ, అర్గళ, కీలకాలతో) శ్లోకాలు 700** ?

అర్గళంలో చివర

**ఇమం తు స్తోత్రం పఠిత్వా తు మహాస్తోత్రం పఠే న్నరః,**
**న తు సప్తశతీసంఖ్యా పర మాప్నో త్యసంశయః.**

అనడాన్నిబట్టి కవచ, అర్గళ, కీలకాలతో సహా మొత్తం సప్తశతి 700 శ్లోకాలు అవుతుం దని కొందరు అంటారు.

కవచ, అర్గళ, కీలకాల్లోని ఉవాచ వాక్యాలతో సహా మొత్తం శ్లోకాలలోని అక్షరాలు – 2869. సప్తశతీ 13 అధ్యాయాలలో శ్లోకాలు, ఉవాచలలో అక్షరాలు 19531 మొత్తం – 22400. అనుష్టుప్ శ్లోకానికి 4×8=32 అక్షరాలు. కాబట్టి ఈమొత్తం అక్షరాలు 32తో భాగిస్తే 700 శ్లోకాలు అవుతాయి. కాన (సప్తశత) శ్లోకసంఖ్యనుబట్టి గూడా సప్తశతి అనేపేరు ఏర్పడిం దని ఒకసమన్వయం. కాని పాఠభేదాదులనుబట్టి ఇక్కడ అక్షరసంఖ్య ఎందులో సరిపోతుందో జాగ్రత్తగా విచారించాల్సిఉంది.

ఈసమన్వయంలో సహజత్వం గూడా తక్కువే. సూటిగా శ్లోకాలసంఖ్య (ఉవాచలు విడిచి) – 666. 700 లకు తక్కువా, ఉవాచలతో సహా 666 + 57= 723. ఏడువందలకు ఎక్కువా అవుతున్నాయి. పూర్వాంగ మైన కవచార్గళకీలకాలు కలిసి ఉత్తరాంగ మయినరహస్యత్రయశ్లోకసంఖ్య కలవకపోవడం విశేషం. అవీ కలిస్తే (29 + 39 + 25 = 93, 723 + 97 = 816) అవుతాయి.

## సప్తశతిశ్లోకాలు

| | | |
|---|---|---|
| సప్తశతి | అష్టసప్తత్యుత్తరశ్లోకానాం శతపంచకం | 578 |
| కవచశ్లోకాలు | కవచే కస్మిన్ సార్ధపంచాశత్ సంఖ్యాః శ్లోకసంగ్రహః | 50½ |
| అర్గళశ్లోకాలు | త్రయోవింశతిః శ్లోకానా మర్గళాయాం చ సంగ్రహః | 23 |
| కీలకశ్లోకాలు | శ్లోకా శ్చతుర్ద శై వాత్ర కీలకే సంప్రతిష్ఠితాః | 14 |
| ప్రాధానికరహస్యం | సార్ధైకత్రింశదాఖ్యాతాః శ్లోకా స్త్వత్ర తు సంస్కృతాః | 31½ |
| వైకృతికరహస్యం | వైకృతాఖ్యరహస్యే తు చత్వారింశత్ ప్రకీర్తితాః | 40 |
| మూర్తిరహస్యం | పంచవింశతిసంఖ్యా స్తు శ్లోకా అత్ర ప్రకీర్తితాః | 25 |
| | మొత్తం షడంగాలశ్లోకాలు | 762 |

సప్తశతీశ్లోకాలు 665½లు, కవచ, అర్గళ, కీలకాలతో రహస్యత్రయంతో గూడా షడంగం మొత్తం కలిపితే 762.

నవాంగాదులుగా భేదా లున్నాయి కదా. సూక్తత్రయాదు లన్ని కూడా కలిపి సంఖ్య మరీ ఎక్కువ. ఏ మైనా, కవచాద్యంగశ్లోకాలతో సహా "సప్తశతి" శ్లోకాలుగా చెప్పడం సముచితమా ?

కాగా శ్లోకాలనుబట్టి సప్తశతి సంఖ్యాపరంగా అన్వయింపబడదు. పూర్తి వాక్యమే మంత్రంలో విభాగిస్తూ కవచ అర్గళ, కీలకాలను కలుపుకొని మంత్రాలతో శ్రీశృంగేరీశ్రీవిరూపాక్షశ్రీపీఠం వారి దేవీమాహాత్మ్యం పరిశీలింపవలసిఉన్నది. తద్జ్ఞు లాపని చేయగలరు.

## చండీస్తవం

ఈసప్తశతికే చండీస్తవ మనీ, చండీస్తోత్ర మని కూడా వ్యవహారం ఉంది.

**చండీస్తవే ప్రతిశ్లోక మేకైకాహుతి రిష్యతే.** (కాత్యాయనీతంత్రం)

**రాత్రిసూక్తం జపే దాదౌ మధ్యే చండీస్తవం పఠేత్** (మరీచికల్పం)

**సార్ధం స్మృతా పఠే చ్ఛండీస్తవం స్పష్టపదాక్షరమ్** (వారాహీతంత్రం)

శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠం వారిసప్తశతిలో అధ్యాయాంతాల్లో **శ్రీదేవీ మాహాత్మ్యే చండీస్తవే** అని సప్తశతికే చండీస్తవం అనేపేరు చూపడం గమనించవచ్చు. ఇలాగే సప్తశతీస్తవం, చండీస్తోత్రం ఇత్యాదిగా దీనికి వ్యవహారం ఉంది.

# చండీస్తోత్రచతుష్టయం

సప్తశతీస్తోత్రం, చండీస్తవం ఇత్యాదిగా ఇది కీర్తింపబడడానికి ఇందులోని దేవీస్తోత్రాలప్రాధాన్యం కారణం. సప్తశతికి పర్యాయంగా ఈస్తోత్రాలు మాత్రమే (చతుష్పది) పారాయణం చేయడమూ ఉంది. ఆస్తోత్రాలు నాలుగు.

## 1. కాళీ (రాత్రి) సూక్తం

**విశ్వేశ్వర్యాదికం సూక్తం, దృష్టం తద్ బ్రహ్మణా పురా,**
**స్తుతయే యోగనిద్రాయా, మమ దేవ్యాః పురందర!**

ప్రథమాధ్యాయంలోని **విశ్వేశ్వరీం** అనే 53వశ్లోకం - త్వం స్వాహా - నుండి **హంతు మేతౌ మహాసురౌ** - అనే 67 శ్లోకం వరకు ఉన్న 15 శ్లోకాలభాగం **రాత్రిసూక్తం**. ప్రథమచరిత్ర అయిన ఈమొదటిఅధ్యాయం కాళీచరిత్ర కాబట్టి దీనిని **కాళీసూక్త** మనీ అంటారు.

## 2. లక్ష్మీ (మహిషాంతకరీ) సూక్తం

**దేవ్యా య యాదికం దివ్యం దృష్టం దేవై ర్మహర్షిభిః.**

చతుర్థాధ్యాయంలోని 2వ శ్లోకం **'దేవ్యా యయా తత మిదం'** - మొదలుకొని **సురారిభవం నమ స్తే** - అనే 22వ శ్లోకంవర కున్న 21 శ్లోకాలు - **మహిషాంతకరీ సూక్తం**. దీన్నే **లక్ష్మీసూక్త** మంటారు. మధ్యమచరిత్ర 2-3-4 అధ్యాయాలు లక్ష్మీ చరిత్ర. కాబట్టి దీనికి లక్ష్మీసూక్తం అని పేరు.

## 3. సరస్వతీ (నారాయణీ) సూక్తం

**దేవి! ప్రసన్నార్తిహరే! ప్రసీ దే త్యాదికం తథా,**
**నారాయణీస్తుతి ర్నామ, సూక్తం పరమశోభనమ్.**

11వ అధ్యాయంలో (మొదటి **దేవ్యా హతే**) **దేవి ప్రసన్నార్తిహరే** అనే 2వ శ్లోకం మొదలుకొని **లోకానాం వరదా భవ** అనే 34వశ్లోకం వరకున్న 33 శ్లోకాలు **నారాయణీస్తుతి**. దీన్నే **సరస్వతీసూక్తం** అంటారు. ఇందులో **నారాయణి నమో ఉస్తు తే** అనేవాక్యం పలుమార్లు ప్రయోగింపడటంవల్ల దీనికి **నారాయణీసూక్తం** అని పేరు. 5 నుండి (10) 13 అధ్యాయాలు ఉత్తమచరిత్ర. సరస్వతీచరిత్ర కూడా. కాబట్టి ఇది **సరస్వతీసూక్తం.**

## 4. చండీ (దేవీ) సూక్తం

ఇవి చండీదేవత వ్యష్టిరూపా లైన మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ స్తోత్రాలు కాగా, సమష్టిరూప మైన మహాలక్ష్మితో అభిన్న మైనరూపంగా మధ్యలో చండీదేవిస్తోత్రం పంచమాధ్యాయంలో ఉన్నది.

పంచమాధ్యాయంలోని – **నమో దేవ్యై మహాదేవ్యై** అనే 7వశ్లోకం మొదలుకొని **భక్తివినమ్రమూర్తిభిః** అనే 36వ శ్లోకంవర కున్న 30 శ్లోకాలభాగం **చండీసూక్తం.** ఇందులో **నమో దేవ్యై** అని దేవీశబ్దం తరచుగా ప్రయోగించడంవల్ల ఇది **దేవీసూక్తం. నమో దేవ్యాదికం సూక్తం సర్వకామఫలప్రదమ్.**

## చండీ ఆరాధనఫలం

మూడేండ్లపాటు చండీదేవిని ఆరాధించి **'వవ్రే నృపో రాజ్యం'** (11-13) **వైశ్య స్తతో జ్ఞానం వవ్రే** (12).

రాజు రాజ్యాన్ని, వైశ్యుడు జ్ఞానాన్ని కోరుకున్నారు. **'దత్వా తయో ర్దేవీ యథాభిలషితం వరమ్'**. రాజు మరుజన్మలో సావర్ణి మను వైనాడు. వైశ్యుడు జ్ఞానంతో ముక్తిని పొందాడు.

ఇలా చండికవల్ల లౌకిక మైనకామ్యాలు, జ్ఞానంద్వారా ముక్తినీ, పొంద వచ్చును. ఇహపరాలు రెండూ ఇచ్చేదేవి కాబట్టి చండిని సకాములూ, నిష్కాములూ కూడా ఇష్టసిద్ధికై ఆరాధించవచ్చు.

**ఏవం యః పూజయేద్ భక్త్యా, ప్రత్యహం పరమేశ్వరీమ్,**
**భుంక్త్వా భోగాన్ యథాకామం, దేవీసాయుజ్య మాప్నుయాత్.**

కాబట్టి ఇహపరాలకు రెంటికీ చండీదేవతాఉపాసన అవసరం.

## చండీ ఉపాసన

చండీ ఉపాసనలో చండీ నవార్ణమంత్రమూ సప్తశతీమాలామంత్రము అనేవి రెండే ముఖ్యం. ఈరెండింటిలోను ఒకటి ప్రధాన మైనపుడు రెండోది దానికి అంగం కావడం అనేపద్ధతి ఉంది. అంటే నవార్ణమంత్రం ప్రధాన మైతే యంత్రంలో నవార్ణదేవతలను పూజించి, జపం చేసి, తర్వాత దాని కంగంగా సప్తశతి పఠించాలి. సప్తశతి ప్రధాన మైతే పై యంత్రంలోనే చండిని ఆవరణదేవతలతో సహా పూజించి,

(నవార్ణం జపించి) సప్తశతి పఠించాలి. ఇందులో నవార్ణజపం సప్తశతికి అంగం. ఇలా కాక కేవలం నవార్ణమంత్రజపం, కేవలం సప్తశతీపాఠం చేసినా ఇష్టసిద్ధి.

**సో ఽపి క్షేమ మవాప్నోతి, సతతం జాప్యతత్పరః.**

**ఏతేన స్తువతాం దేవీస్తోత్రమాత్రేన సిద్ధ్యతి** అని కీలకాధ్యాయం చెప్తున్నది మొత్తంపై దేవీఉపాసనావిధానా లన్నింటిలో సప్తశతీఉపాసనమే విశిష్ట మైనదిగా శివమతాన్ని తద్జ్ఞులు గుర్తించారు. కాబట్టి చండీదేవీవిషయంలో సప్తశత్యుపాసనం ప్రధానం.

## సప్తశతి ఉపాసన

పూజ, పారాయణం, హోమం, తర్పణం అని సప్తశతి ఉపాసనం మూడు విధాలుగా ఉంది.

## చండీతర్పణం

జపాద్యంగంగా దశాంశతర్పణం సర్వమంత్రసాధారణం. అలాగే చండీ నవార్ణమంత్రజపానికి గూడా దశాంశనవార్ణమంత్రతర్పణం ఉంది. సప్తశతి విషయంలో చండీవిశేషతర్పణం చెప్పబడింది.

### 1. నవార్ణతర్పణం

నద్యాదులందు స్నానం చేసి, బొడ్డులోతు నీళ్ళలో నిలబడి, నవార్ణాలతో పదిదోసిళ్ళతో తనను తడుపుకోవాలి. ఆనదీతీరంలోనే మాధ్యాహ్నికక్రియలు గూడా తీర్చుకొని, ఏకాగ్రచిత్తంతో

**1. ఓం హ్రీం చండికాయై హృదయాయ నమః**

**2. ఓం హ్రీం చండికాయై శిరసే నమః**

**3. ఓం హ్రీం చండికాయై శిఖాయై నమః**

**4. ఓం హ్రీం చండికాయై కవచాయ నమః**

**5. ఓం హ్రీం చండికాయై నేత్రత్రయాయ నమః**

**6. ఓం హ్రీం చండికాయై అస్త్రాయ నమః**

అంటూ మహాలక్ష్మీషడంగన్యాసం చేసుకోవాలి. తర్వాత **1. ఓం హ్రీం 2.**

**ఓం చం 3. ఓం డిం 4. ఓం కాం 5. ఓం యైం 6. ఓం హ్రీం చండికాయైం** అనేవాటితో కరహృదయాదిన్యాసం చేసుకోవాలి.

**చండీకాం త్రిజగద్ధాత్రీం బ్రహ్మాద్యమరవందితామ్.**

అని మహాలక్ష్మిని ధ్యానం చేయాలి. నవార్ణం జపించి, దానిచివర **'చండికా తృప్యతాం'** అని చెప్తూ తర్పణం విడవాలి.

## 2. సప్తశతీతర్పణం

13 పాత్రలను తీసుకొని, వాటిని ఆవుపాలతో నింపి, వరుసలో ఉంచాలి. అందులో పుష్పాలు ఉంచాలి. ప్రతిశ్లోకం(మంత్రం)తోనూ తర్పణం చేయాలి. ప్రథమాధ్యాయం తర్పణం చేసేటప్పుడు ప్రథమపాత్రలోనిపాలు ఉపయోగించాలి. ఇలాగే ద్వితీయాధ్యాయతర్పణంలో ద్వితీయపాత్రలో పాలు ఉపయోగించాలి. ఈ క్రమంలో ఏఅధ్యాయం తర్పణం చేసేటప్పుడు ఆసంఖ్య గలపాత్రలోనిపాలే ఉపయోగించాలి.

ఏశ్లోకంతో తర్పణం చేసేటప్పుడు ఆశ్లోకం చెప్పినతర్వాత ఆఅధ్యాయ దేవతకు తర్పణం చేస్తున్నట్లుగా చెప్పాలి. ఉదాహరణకు ప్రథమాధ్యాయతర్పణంలో అందులో శ్లోకం చెప్పినతర్వాత **ప్రథమాధ్యాయదేవతాం తర్పయామి** అని చెప్పి పాలతో తర్పణం విడవాలి. ఇలాగే ద్వితీయాధ్యాయతర్పణంలో శ్లోకం చెప్పాక **ద్వితీయాధ్యాయదేవతాం తర్పయామి** అనీ, ఈవిధంగా ఆయాఅధ్యాయాలలో ఆయాసంఖ్య గలఅధ్యాయ దేవతలకు తర్పణం అని చెప్పాలి.

ఈరెండువిధా లైనతర్పణం కూడా ఇప్పుడు ఆచరణంలో ఎక్క డైనా ఉన్న దేమో పరిశోధించి కనుక్కోవాలి.

## చండీహోమం

నేటికీ అన్నిప్రాంతాలలోనూ వివిధకామ్యాలసాధనంలో బాగా విస్తారంగా ప్రచారంలో ఆచరణంలో ఉన్నది చండీహోమం. దీనివిషయం కూడా విస్తృత మై ప్రత్యేకంగా ప్రస్తావించుకోవలసినది. కాబట్టి ఆవిషయాన్ని ఆసందర్భంలో చెప్పుకోవడం న్యాయం.

# చండీదేవిఅర్చనం

మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ అనేదేవతలనూ వారి కాద్య అయిన మహాలక్ష్మిని (అందరూ చండీశబ్దవాచ్యలే) పూజించేవిధానంలో దేవతస్థానక్రమం వైకృతికరహస్యంలో చెప్పబడింది. (16–25) ఆక్రమంలో ఆయాదేవతల నుంచిన యంత్రాలలో చండీఅర్చన చేయాలి.

## వైకృతికరహస్యోక్తయంత్రాలు

**1. చతుర్భుజమహాలక్ష్మీప్రధానయంత్రం.**

| | | |
|---|---|---|
| 1. గౌరీ రుద్రులు | వాణీ బ్రహ్మలు | లక్ష్మీ విష్ణువులు |
| 2. చతుర్భుజ కాళి | 3. చతుర్భుజ మహాలక్ష్మి | 4. చతుర్భుజ సరస్వతి |
| 5. అష్టభుజ సరస్వతి | 6. అష్టాదశభుజ లక్ష్మీ | 7. దశభుజ కాళి |

1. వైకృతిక 19
2. ప్రాధానిక, 9
3. ప్రాధానిక, 5
4. ప్రాధానిక, 4
5. వై.ర. 15
6. వై.ర. 10 వైజన

**2. అష్టాదశభుజలక్ష్మీప్రధానయంత్రం**

| | | |
|---|---|---|
| 1. గౌరీ రుద్రులు | వాణీ బ్రహ్మలు | లక్ష్మీ విష్ణువులు |
| 8. దశభుజ కాళి | అష్టాదశభుజ మహాలక్ష్మి సింహ మహిష | 4. చతుర్భుజ సరస్వతి |
| చతుర్భుజ కాళి | చతుర్భుజ సరస్వతి | చతుర్భుజ లక్ష్మి |

8. వైకృతిక 21.

9, 10 వైకృతిక, 30

| | | |
|---|---|---|
| 1. గౌరీ రుద్రులు | వాణీ బ్రహ్మలు | లక్ష్మీ విష్ణువులు |
| 11 యముడు | దశభుజ కాళి | మృత్యువు |
| చతుర్భుజ కాళి | చతుర్భుజ లక్ష్మి | చతుర్భుజ సరస్వతి |

11. వై.ర. 22

**4. అష్టభుజసరస్వతీయంత్రం**

| | | |
|---|---|---|
| 1. గౌరీ రుద్రులు | వాణీ బ్రహ్మలు | లక్ష్మీ విష్ణువులు |
| 12 రుద్రుడు | అష్టభుజ సరస్వతి 13 నవశక్తులు | వినాయకుడు |
| చతుర్భుజ కాళి | చతుర్భుజ లక్ష్మి | చతుర్భుజ సరస్వతి |

12. 13. వై.ర. 23

# చండీఆవరణార్చనం

వావిళ్ళవారు ప్రచురించిన శ్రీచండీనిత్యపూజావిధానంలోనినవావరణార్చనం ఈగ్రంథంలో అనుబంధంలో ఇవ్వబడింది. సప్తశతీమీమాంసలో ఈయబడిన చండికోపాస్తిదీపికలోనిచండీయంత్రోద్ధారం దీనిని పోలిఉండడంతో అది అధస్సూచికలో చూపబడింది. 6, 7 ఆవరణదేవతలు అటూ ఇటూ కావటం ఒకభేదం

ఆవరణదేవతలతో చండిని చండీపూజాయంత్రంలో అర్చించాలి. కాని యీపూజాయంత్రాలలో గూడా భేదాలు కనిపిస్తున్నాయి.

## శ్రీచక్రం

శ్రీచక్రంలో శ్రీమహాత్రిపురసుందరీనవావరణార్చనమే చండీఉపాసనలోను చేయడం గమనించవచ్చు. (సమ్మెటప్రతి)

## చండీయంత్రం - 1



# చండీయంత్రం - 2




దేవీమాహాత్మ్యం చెప్పిన (నవార్ణ)పూజాయంత్రం.

**1. పీఠం** : యంత్రానికి వెలుపలగా

1. ఆగ్నేయకోణం – జయ
2. నైఋతికోణం–విజయ
3. వాయవ్యకోణం – జయంతి
4. ఈశాన్యకోణం – అపరాజిత

**2. బిందువు** : చండీదేవి

**3. దేవి ఎదుట** : ఉత్తరాన – సింహం. దక్షిణాన – మహిషం

**4. త్రికోణం** : 1. తూర్పుకోణం – వాణీబ్రహ్మలు

2. నైఋతికోణం – లక్ష్మీనారాయణులు

3. వాయవ్యకోణం – ఉమాశంకరులు

**5. షట్కోణం** : తూర్పు మొదలు ప్రదక్షిణంగా

1. నందజ 2. రక్తదంత 3. శాకంభరి
4. దుర్గ 5. భీమ 6. భ్రామరి

**6. అష్టదళం** : తూర్పు మొదలు ప్రదక్షిణంగా

1. బ్రాహ్మి 2. మాహేశ్వరి 3. కౌమారి 4. వైష్ణవి
5. వారాహి 6. నారసింహి 7. ఐంద్రి 8. చాముండ

**7. తత్త్వపత్రం :** 24 దళాలలో తూర్పు మొదలు ప్రదక్షిణంగా

| | | | |
|---|---|---|---|
| 1. విష్ణుమాయ | 2. చేతన | 3. బుద్ధి | 4. నిద్ర |
| 5. క్షుధ | 6. ఛాయ | 7. శక్తి | 8. తృష్ణ |
| 9. క్షాంతి | 10. జాతి | 11. లజ్జ | 12. శాంతి |
| 13. శ్రద్ధ | 14. కాంతి | 15. లక్ష్మి | 16. ధృతి |
| 17. వృత్తి | 18. శ్రుతి | 19. స్మృతి | 20. దయ |
| 21. తుష్టి | 22. పుష్టి | 23. మాత | 24. భ్రాంతి |

(5వ అధ్యాయం – దేవీసూక్తం)

**8. భూపురం :**

1. తూర్పుకోణం – గణపతి 2. దక్షిణకోణం – క్షేత్రపాలకుడు
3. పశ్చిమకోణం – వటువు 4. ఉత్తరకోణం – యోగినులు

**9. భూపురం :** వెలుపల – లోకప్రసిద్ధ మైన తూర్పు మొద లైనదిక్కులలో

| | |
|---|---|
| 1. తూర్పు | వజ్రాయుధంతో ఇంద్రుడు |
| 2. ఆగ్నేయం | శక్తితో అగ్ని |
| 3. దక్షిణం | దండంతో యముడు |
| 4. నైఋతి | ఖడ్గంతో నిరృతి |
| 5. పశ్చిమం | పాశంతో వరుణుడు |
| 6. వాయవ్యం | అంకుశంతో వాయువు |
| 7. ఉత్తరం | గదతో కుబేరుడు |
| 8. ఈశాన్యం | చక్రంతో ఈశ్వరుడు |

# చండీయంత్రం - 3



బిందు, త్రికోణ (వృత్త), షట్కోణ (వృత్త), అష్టకోణ (వృత్త), అష్టదళ పద్మ (వృత్త), భూపురాలతో ఉన్న మరోయంత్రంలో తొమ్మిదిఆవరణలు చాలా విస్తృతంగా ఉన్నాయి. ఇందులో చతుర్వింశతిదళం లేకున్నా ఆవరణదేవతలసంఖ్య అత్యధికం. చూ, చండీనవార్ణపూజాకల్పం.

# చండీ యంత్రం - 4



షట్కోణ, అష్టదళపద్మ, చతుర్వింశతిదళ, భూపురాలతో ఉన్న మరోయంత్రం బృహత్‌స్తోత్రరత్నాకరం ప్రదర్శిస్తున్నది.

**1. షట్కోణం – నడుమ :** 1. మహాలక్ష్మి,

ఆమె వెనుక

| | |
|---|---|
| పశ్చిమకోణంలో | 2. వాణీబ్రహ్మలు |
| నైఋతికోణంలో | 3. గౌరీరుద్రులు |
| వాయవ్యకోణంలో | 4. లక్ష్మీవిష్ణుమూర్తులు |
| తూర్పుకోణంలో | 5. అష్టాదశభుజ |
| ఆగ్నేయకోణంలో | 6. దశానన |
| ఈశాన్యకోణంలో | 7. అష్టభుజ |

**2. షట్కోణంలోపల :**

| | | | |
|---|---|---|---|
| తూర్పున | 1. నందజ | ఆగ్నేయం | 2. రక్తదంతిక |

| | | | |
|---|---|---|---|
| నైఋతి | 3. శాకంభరి | పశ్చిమం | 4. దుర్గ |
| వాయవ్యం | 5. భీమ | ఈశాన్యం | 6. భ్రామరి |

**3. షట్కోణం వెలుపల :**

| | | | |
|---|---|---|---|
| ఆగ్నేయం | 1. జయ | నైఋతి | 2. విజయ |
| వాయవ్యం | 3. జనిత | ఈశాన్యం | 4. అపరాజిత |

**షట్కోణం వెలుపల కుడిప్రక్క –** సింహం, **ఎడమప్రక్క –** మహిషం.

**4. అష్టదళం** 8 దళాల్లో తూర్పునుంచి ప్రదక్షిణంగా బ్రాహ్మీ, చాముండాదులు.

**5. అష్టదళం** 8 దళాల్లో తూర్పునుంచి ప్రదక్షిణంగా అసితాంగభైరవాదులు.

**6. చతుర్వింశతిదళం**లో విష్ణుమాయాదులు.

**7. భూపురం :** తూర్పు మొదలు లోకప్రసిద్ధదిక్కుల్లో ఇంద్రాదిదిక్పాలకులు.

**8. భూపురం :** తూర్పు మొదలు లోకప్రసిద్ధదిక్కుల్లో వజ్రం మొద లైనదిక్పాలకాయుధాలు.

**9. భూపురం వెలుపల :**

| | | | | | |
|---|---|---|---|---|---|
| తూర్పున | – | గణపతి | దక్షిణం | – | క్షేత్రపాలకుడు |
| పశ్చిమం | – | వటువు | ఉత్తరం | – | యోగినులు |

త్రికోణం లేనిఈయంత్రానికి పూర్వయంత్రంలో ఆవరణదేవతలతో సహా సామ్యం ఉంది. దేవీపూజాకల్పం నవారణాలతో దీనికి కొంత పోలిక ఉంది.

# చండీయంత్రం - 5



ఇది కాక (బిందు) త్రికోణ, అష్టకోణ, వృత్తత్రయ, అష్టదళ, భూపురాలతో దుర్గాయంత్రం మరొకటి కనిపిస్తుంది. (సమ్మెట ప్రతి)

ఈయంత్రంలో ఏదో ఒకదానిలో చండీపూజ చేయాలి. అయితే పూజ కంటే సప్తశతీపారాయణకే ప్రచారం, ప్రాముఖ్యం ఎక్కువగా ఉంది.

# చండీసప్తశతీపారాయణం

ఇది చండీదేవతయొక్క చరిత్ర పారాయణం కాబట్టి చండీపారాయణం. సప్తశతి (700 మంత్రాల) స్తోత్రపారాయణం. కాబట్టి సప్తశతీపారాయణం. చండీచరిత్ర అయినసప్తశతీపారాయణం కాబట్టి చండీసప్తశతీపారాయణం.

## పారాయణ ఎందుకు చేయాలి

దేవీమాహాత్మ్యాన్ని వర్ణించేసప్తశతి చండీస్తవం. చండీఉపాసనలో శీఘ్ర ఫలకారి యై, ఆర్షసంప్రదాయంగా, అనాదిగా ఈదేవీస్తోత్రం పారాయణం చేయబడుతూ ఇహపరసాధకం అయిఉన్నది. వివిధవిధానాలతో పారాయణలవల్ల వివిధకామ్యాలు నెరవేరడం ప్రసిద్ధం. ఏఏకామ్యాలకోసం సప్తశతిని ఎలా ఉపాసించాలో చివరలో గమనిస్తాం. ఇహాని కైనా, పరాని కైనా ఈసప్తశతిని పారాయణం చేయాలి.

## పారాయణ ఎప్పుడు చేయాలి

1. షడంగాలతో నిత్యమూ పారాయణం చేయడం సర్వశ్రేష్ఠం. అటువంటివాడిని చండి నిత్యమూ అంటిపెట్టుకొనిఉంటుంది.

   **య త్రైతత్పఠ్యతే సమ్యక్ నిత్యమాయతనే మమ**

   **సదా న తద్ విమోక్ష్యామి సాన్నిధ్యం తత్ర మే స్థితిః ॥**

2. లేకపోతే, శుక్లపక్షంలో నైనా, కృష్ణపక్షంలో నైనా అష్టమి, నవమి, చతుర్దశి తిథులలో పారాయణం చేయడం మేలు.

   **అష్టమ్యాం చతుర్దశ్యాం నవమ్యాం చైకచేతసః**

   **శ్రోష్యంతి చైవ యే భక్తా మమ మాహాత్మ్య ముత్తమమ్ ॥**

3. లేదా సంవత్సరాని కొకపర్యాయం శరత్కాలంలో ఆశ్వయుజం పాడ్యమినుంచి తొమ్మిది రోజులు పారాయణం చేయడం మేలు.

   **శరత్కాలే మహాపూజా క్రియతే యా చ వార్షికీ,**

   **తస్యాం మ మైతన్మాహాత్మ్యం శ్రుత్వా భక్తిసమన్వితః ॥**

కనీసం పర్వదినాలలో, కామ్యాలనుబట్టి అవసరసమయాల్లోనూ, యథాశక్తి పారాయణం చేయడం ఒకపక్షం.

## పారాయణ ఎలా చేయాలి

స్నానాదికం చేసి శుచి అయిన పట్టు లేదా ఇతరవస్త్రాలు ధరించి, దేవాలయంలో గాని, ఇంట్లో నిత్యమూ పూజ చేసేచోట గానీ, లేదా శుచి అయిన ప్రదేశంలో తగినఆసనంలో తూర్పు లేదా ఉత్తరముఖంగా (కొందరు పశ్చిమం అంటారు) కూర్చుండి దీపారాధన చేసి, పారాయణం చేయాలి. పారాయణం అయ్యేంత వరకు ఆదీపం ఉండాలి.

సప్తశతిని కంఠస్థం చేసి, పుస్తకం లేకుండా పారాయణం చేయడం ఉత్తమం. వెయ్యికంటే ఎక్కువ శ్లోకా లున్నగ్రంథ మైతేనే పుస్తకంతో పఠించాలి.

**పుస్తకే వాచనం హస్తే సహస్రా దధికం యది,**

**తతో న్యూన స్స తు భవే ద్వాచనం పుస్తకం వినా.**

కంఠస్థం కాకపోతే పుస్తకంతో చదువవచ్చు. పుస్తకాన్ని చేతితో పట్టుకొని చదవాలి కాని వ్యాసపీఠంమీదో, పీటమీదో, మరెక్కడో ఉంచి చదువరా దంటారు కొందరు.

అధ్యాయం మధ్యలో ఆపగూడదు. ఇతరప్రసంగాలు చేయగూడదు. కూర్చున్న చోటినుండి లేవగూడదు.

**యావ న్న పూర్యతే ఽధ్యాయ స్తావ న్న విరమేత పఠన్.**

ప్రమాదంవల్ల ఆపితే తిరిగి ఆచమనం చేసి, పదిసార్లు మూలమంత్రం జపించి, ఆపినఅధ్యాయం మళ్ళీ మొదలుపెట్టి పఠించాలి.

**యది ప్రమాదా దధ్యాయే విరామో భవతి ప్రియే,**

**పున రధ్యాయ మారభ్య పఠేత్ సర్వం ముహు ర్ముహుః.**

అవకాశం లేకపోతే మధ్యచరిత్ర ఒక్కటి న్యాసంతో పారాయణ చేయాలి. మిగిలినవి ఒక్కొక్కటి చేయరాదు. అధ్యాయంలో కొంతభాగం ఎప్పుడూ చేయగూడదు.

**ఏకేన వా మధ్యమేన నైకే నేతరయో రిహ.**

క్రమంగా శిరఃకంపం మొద లైనవి కూడా లేకుండా మనసు ఏకాగ్రంగా ఉంచుకొని పఠించాలి. **అనుక్రమాత్ పఠే ద్దేవి, శిరఃకంపాదికం త్యజేత్,**

మానసికంగా అంటే మౌనంగా పఠించగూడదు. అది దుఃఖం కలిగిస్తుంది. వాచకపఠనం పైకి అభినయంతో వినబడేటట్లుగా ప్రతిఅక్షరమూ పదమూ, శ్లోకమూ స్పష్టంగా, అర్థవంతంగా చదవాలి. అలా గని మరీ పెద్దగా రాగయుక్తంగా చదువ గూడదు. తొందరగానూ చదవగూడదు.

**న మానసం పఠేత్ స్తోత్రం, వాచికం తు ప్రశస్యతే.**
**ఉచ్చైః పాఠో నిషిద్ధ స్స్యాత్, త్వరాం చ పరివర్జయేత్,**
**సార్థం స్మృతో పఠే చ్ఛండీస్తవం స్పష్టపదాక్షరమ్.**

## కొన్ని సామాన్య నియమాలు

1. స్తోత్రం గానీ, సంహిత గానీ మొదట ఓంకారం చెప్పి పఠించాలి. చివర గూడా ఓం చెప్పా లని ఒకమతం.

    **ప్రణవం పూర్వ ముచ్చార్య స్తోత్రం వా సంహితాం పఠేత్,**
    **అంతే చ ప్రణవం దద్యా ది త్యువా చాదిపూరుషః.**

2. తప్పులు రావచ్చు గాబట్టి తాను వ్రాసుకొన్నదాన్ని గానీ, అబ్రాహ్మణులు వ్రాసి దానిని గానీ పారాయణం చేయకూడదు. అందుకే ఉపదేశం చేసినగురువులే ఆమంత్రాదులను స్వయంగా వ్రాసి, శిష్యులకు ఇవ్వడం లోకంలో గమనించవచ్చు.

    **న స్వయం లిఖితం స్తోత్రం, నాబ్రాహ్మణలిపిం పఠేత్.**

3. తానో, తనలాంటియితరసామాన్యులో చెప్పినస్తోత్రం పారాయణం చేయగూడదు. కలియుగంలో ఋషులు చెప్పినస్తోత్రం మాత్రమే పారాయణం చేయాలి.

    **న చ స్వయం కృతం స్తోత్రం, త థాన్యేన చ యత్కృతమ్,**
    **యతః కలౌ ప్రశంసతి ఋషిభి ర్భాషితం తు యత్.**

4. ప్రతిఅక్షరం స్పష్టంగా, వినబడేటట్లుగా, సందేహం కలగకుండా అర్థవంత మైనపదవిభాగంతో మంచిస్వరంతో మధురంగా పఠించాలి.

    **మాధుర్య, మక్షరవ్యక్తిః, పదచ్ఛేద స్తు, సుస్వరః,**
    **ధైర్యమ్, లయసమర్థం చ ష డేతే పాఠకా గుణాః ॥**

## సప్తశతీ పారాయణవిషయక్రమం

ఇంక ప్రస్తుత మైన సప్తశతిని పారాయణం చేసేటప్పుడు అందులోనివిషయం ఏక్రమంలో ఉన్నదో చూడాలి.

# 1. ప్రణవాదిరహస్యాంతం

**ప్రణవాది రహస్యాంతం, చండికాచరితత్రయమ్,**

**నిత్యం ప్రపాఠనం కుర్యాత్, సర్వత్ర మాతృసిద్ధయే.** (రుద్రయామళం)

పారాయణంలో అంశాలు మూడు. 1. ప్రణవాది 2. రహస్యాంతం 3. చరిత్రత్రయం

## 1. ప్రణవాది

ప్రణవాది అంటే 'ఓం'. ఇందులో అకారం, ఉకారం, మకారం మూడున్నాయి. అకారం బ్రహ్మనీ, ఉకారం విష్ణువునీ, మకారం మహేశ్వరుణ్ణీ బోధిస్తాయి. ప్రస్తుతగ్రంథంలో

**'కీలకం శంకరప్రోక్తం, కవచం బ్రహ్మణా కృతమ్,**

**అర్గళం విష్ణునా ప్రోక్త, మేత త్రితయ ముత్తమమ్'.** (డామరతంత్రం)

1. కవచం – బ్రహ్మప్రోక్తం, 2. అర్గళం – విష్ణుప్రోక్తం, 3. కీలకం – మహేశ్వరప్రోక్తం. కాబట్టి ప్రణవాది అంటే కవచ, అర్గళ, కీలకాలు మొదటగా పారాయణం ప్రారంభించాలి.

### కవచ, అర్గళ, కీలకాల క్రమం

**1. జపేత్ సప్తశతీం చండీం, కృత్వా కవచం పురా.**

(తస్మా జ్జాప్యం సదా భక్తైః కవచం కామదం మునే.) అనడాన్నిబట్టి కవచం మొదట చెప్పాలి.

**కవచం బీజ ముద్దిష్ట, మర్గలా శక్తి రుచ్యతే,**

**కీలకం కీలకం ప్రాహుః, సప్తశత్యా మహామనోః.**

అని యోగరత్నావళి ననుసరించి మొదట కవచం, తర్వాత అర్గళం, ఆతర్వాత కీలకం షడంగవిధానంలో ఈక్రమం పాటింపబడుతున్నది.

**అర్గలం కీలకం చాదౌ, పఠిత్వా కవచం పఠేత్.**

**జప్యా సప్తశతీ పశ్చాత్, సిద్ధికామేన మంత్రిణా.**

అనేచిదంబరసంహితావచనాన్నిబట్టి మొదట అర్గళం, తర్వాత కీలకం, తర్వాత కవచం అనేతీరుగా నవాంగ ద్వాదశాంగవిధానాలలో పాఠక్రమంలో మార్పు కనిపిస్తుంది.

## కవచ - అర్గళ - కీలక వైశిష్ట్యం

సప్తశతీపాఠంలో కవచ అర్గళ కీలకాలప్రాధాన్యాన్నిగురించి -

**అరుణాఖ్య స్తతో దైత్య స్త్రైలోక్యం చాతిపీడయత్,**
**తతో దేవా ఋషిస్తోత్రం, వినా సప్తశతీం మనుమ్,**
**జపంత స్తు మహాకాలం మహాదేవీ ముపాసతః,**
**అప్రసన్నా మహాదేవీ, దేవా బ్రహ్మాణ మాయయుః ॥**
**శనై ర్విష్ణుం, శనై శ్శంభుం, దృష్ట్వా సర్వం వ్యబోధయన్**
**ఈశ్వర స్తాన్ సమాలోక్య కవచార్గళకీలకైః.**
**సహ సప్తశతీమాలామహామంత్ర ముపాదిశత్,**
**తతః ప్రసన్నా శ్రీదేవీ భ్రామరం రూప మాశ్రితా.**
**అనేకభ్రమరై స్సార్ధ మరుణాఖ్యం మహాసురమ్,**
**హత్వా బ్రహ్మాదిదేవానాం భీతానా మభయం దదౌ ।** (డామరతంత్రం)

అరుణు డనేరాక్షసుడిని జయించడానికి దేవతలు సప్తశతీమంత్రం జపించారు. ఎంతకాల మైనా దేవి ప్రసన్నం కాలేదు. అపుడు దేవతలు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల వద్దకు వెళ్ళి చెప్పారు. అపు డీశ్వరుడు కవచ, అర్గళ, కీలకాలతో సప్తశతిని ఉపదేశించాడు. దేవత లాప్రకారంగా ఉపాసించగా దేవి ప్రసన్న మై తుమ్మెదలరూపంలో అరుణుడిని చంపింది. దీన్నిబట్టి కామ్యార్థసిద్ధికి సప్తశతిని కవచార్గళకీలకాలతో తప్పక జపించా లనీ, అవి ఉంటేనే సప్తశతి ఇష్టార్థాన్ని ఇస్తుం దనీ తెలుస్తున్నది.

**కవచం బీజ మాదిష్ట, మర్గళా శక్తి రుచ్యతే,**
**కీలకం కీలకం ప్రాహు, స్సప్తశత్యా మహామనోః**

సప్తశతీమంత్రానికి బీజం - కవచం. శక్తి - అర్గళం. కీలకం - కీలకస్తోత్రం, మంత్రసిద్ధికి ఈమూడూ ప్రధానాంగాలు.

**అర్గళం దురితం హంతి, కీలకం ఫలదం భవేత్,**
**కవచం రక్షతే నిత్యం, తస్మా దేతత్త్రయం పఠేత్.**
**అర్గళం పాపనాశాయ, కీలకం పుణ్యహేతవే,**
**కవచం రక్షణార్థాయ, పశ్చాత్ చండికాం జపేత్.** (కేరళతంత్రం)

అర్గళం పాపాలను పోగొడుతుంది. కీలకం ఫలితా న్నిస్తుంది. కవచం ఎప్పుడూ రక్షిస్తుంది.

**అర్గళం హృదయే యస్య తస్మా దర్గళవా నసౌ.**

హృదయంలో అర్గళం ఉన్నవాడు అర్గళవంతుడే.

**కీలకం హృదయే యస్య, స కీలిత మనోరథః.**

కీలకం ధరించినవాడు కోరికలు తీరినవా డవుతాడు.

**కవచం హృదయే యస్య, స వజ్రకవచప్రభుః.**

కవచం ధరించినవాడు వజ్రకవచం కలిగినవాడే.

**కవచ - అర్గళ - కీలకాలు - లఘురూపం**

**శూలేన సర్వత శ్చాంతే కవచం సర్వసిద్ధిదమ్.**

**సర్వస్వరూపే శ్లోకాది వయ మం తార్గళాస్తుతిః.**

**త్వం శ్రీ స్త్వ మీశ్వరీ శ్లోకా వాయుధాంతే చ కీలకమ్.** (రుద్రయామళం)

**లఘుకవచం**

(5 అధ్యాయం 23 నుండి 26-4 శ్లోకాలు)

**శూలేన పాహి నో దేవి ! పాహి ఖడ్గేన చాంబికే!**
**ఘంటాస్వనేన నః పాహి, చాపజ్యానిస్స్వనేన చ.**

**ప్రాచ్యాం రక్ష, ప్రతీచ్యాం చ చండికే! రక్ష దక్షిణే,**
**భ్రామణే నాత్మశూలస్య, ఉత్తరస్యాం త థేశ్వరి !**

**సౌమ్యాని యాని రూపాణి, త్రైలోక్యే విచరంతి తే,**
**యాని చాత్యంతఘోరాణి, తై ర క్షాస్మాం స్తథా భువమ్.**

**ఖడ్గశూలగదాదీని, యాని చాస్త్రాణి తే ఽంబికే !**
**కరపల్లవసంగీని తై రస్మాన్ రక్ష సర్వతః.**

**లఘుఅర్గళం**

(11 అధ్యాయం 23 నుండి 27. ఐదు శ్లోకాలు)

**సర్వస్వరూపే ! సర్వేశే ! సర్వశక్తిసమన్వితే!**
**భయేభ్య స్త్రాహి నో దేవి ! దుర్గే! దేవి ! నమో ఽస్తు తే.**
**ఏత త్తే వదనం సౌమ్యం, లోచనత్రయభూషితమ్,**
**పాతు న స్సర్వభూతేభ్యః, కాత్యాయని ! నమో ఽస్తు తే ।**
**జ్వాలాకరాళ మత్యుగ్ర, మశేషాసురసూదనమ్,**
**త్రిశూలం పాతు నో భీతే, ర్భద్రకాళి ! నమో ఽస్తు తే !**
**హినస్తి దైత్యతేజాంసి, స్వనే నాపూర్య యా జగత్,**
**సా ఘంటా పాతు నో దేవి ! పాపేభ్యో న స్సుతా నివ.**
**అసురాసృగ్వసాపంకచర్చిత స్తే కరోజ్జ్వలః,**
**శుభాయ ఖడ్గో భవతు చండికే ! త్వాం నతా వయమ్.**

**లఘుకీలకం**

(ప్రథమాధ్యాయం 60, 61- రెండు శ్లోకాలు)

**త్వం శ్రీః, త్వ మీశ్వరీ, త్వం హ్రీం, స్త్వం బుద్ధిలక్షణా,**
**లజ్జా పుష్టి స్తథా తుష్టి స్త్వం శాంతిః క్షాంతి రేవ చ.**
**ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా,**
**శంఖినీ చాపినీ బాణభుశుండీ పరిఘాయుధా.**

ఇలా కవచ, అర్గళ, కీలకాలు కూడా సప్తశతిలోనివే కావడం ఒకమతంగా ఉన్నా దీనికి ప్రచారం కానరా దంటారు.

కొందరిసంప్రదాయంలో ఇక్కడ గురుకీలకం అని మరొకటి పారాయణంలో ఉన్నది. కీలకానికి గురుకీలకానికి విషయంలో భేదం గోచరిస్తున్నది. సామ్యం నామమాత్రం అనవచ్చు. నవశతిలోనూ, సప్తశతిలోనే కొందరిమతంలోనూ కీలకం లేకుండానూ కీలకంతోపాటుగానూ ఈగురుకీలకం పారాయణం చేయబడుతున్నది.

# గురుకీలకమ్

పురా సనత్కుమారాయ, దత్త మేత న్మ యానఘ!
సంవర్తాయ దదౌ త చ్చ, స చాన్యస్మై దదౌ చ తత్. 1

సర్వత్ర చండీపాఠస్య, ప్రాచుర్యేణ మహీతలే,
బ్రాహ్మకాండః, కర్మకాండః, స్తంత్రకాండ శ్చ, సర్వదా, 2

అభూత్ ప్రతిహతో ఽనేన, శీఘ్రసిద్ధిప్రదాయినా,
తథా తేషాం చ సార్థక్యం, కర్తుం కామేన భూతలే. 3

దానప్రతిగ్రహణేన, మంత్రో ఽయం కీలితో మయా,
దానప్రతిగ్రహాఖ్యం, యత్కీలకం సముదాహృతమ్. 4

తదారభ్య చ మంత్రో ఽయం, కీలకే నాభికీలితః,
సర్వేషాం భవేత్ సిద్ధ్యై, యే కీలకపరాఙ్ముఖాః. 5

యే నరాః కీలకే నేమం, జపంతి పరయా ముదా,
తేషాం దేవీ ప్రసన్నా స్యాత్, తత స్సర్వా స్సమృద్ధయః. 6

త్వత్ప్రసూత స్వదాజ్ఞప్త, స్త్వద్దాస స్త్వత్పరాయణః,
త్వన్నామచింతనపర, స్త్వదర్థో ఽహం నియోజితః. 7

మ యార్జిత మిదం సర్వం, తవ స్వం పరమేశ్వరి,
రాష్ట్రం బలం కోశగృహం, సైన్య మన్య చ్చ సాధనమ్. 8

త్వదధీనం కరిష్యామి, య త్రార్థే నియోక్ష్యసి,
తత్ర దేవి సదా వర్తే, త వాజ్ఞా మేవ పాలయన్. 9

ఇతి సంచింత్య మనసా, స్వార్జితాని ధనాని చ,
కృష్ణాయాం వా చతుర్దశ్యా, మష్టమ్యాం వా సమాహితః 10

సమర్పయే న్మహాదేవ్యై, స్వార్జితం సకలం ధనమ్,
రాష్ట్రం బలం కోశగృహం, నవం యద్ య దుపార్జితమ్. 11

అస్మిన్ మాసి మయా దేవి, తుభ్య మేతత్ సమర్పితమ్,
ఇతి ధ్యాత్వా తతో ఽస్యాః, ప్రసాదాత్ ప్రతిగృహ్య చ. 12

విభజ్య పంచధా సర్వం, త్ర్యంశాన్ సార్థం ప్రకల్పయేత్,
దేవపిత్రతిథీనాం చ, క్రియార్థం త్వేక మాదిశేత్. 13

ఏకాంశం గురవే దద్యాత్, తేన దేవీ ప్రసీదతి,
తస్య రాజ్యం బలం సైన్యం, కోశ స్సాధు వివర్ధతే. 14

నానారత్నాకర శ్రీమాన్, యథా పర్వణి వారధిః,
జ్ఞాత్వా నవాక్షరం మంత్రం, జీవబ్రహ్మసమాశ్రయమ్. 15

తత్త్వ మ స్యాదివాక్యానాం, సారం సంసారభేషజమ్,
సప్తశత్యాఖ్యమంత్రస్య, యావజ్జీవ మహం జపమ్. 16

కుర్వన్ తతో న ప్రమాదం, ప్రాప్నుయా మితి నిశ్చయమ్,
కృత్వా ప్రారభ్య కుర్వీత, హ్యకుర్వాణో వినశ్యతి. 17

మాహం బ్రహ్మ నిరాకుర్యాం, మా మాబ్రహ్మ నిరాకరోత్,
అనిరాకరణం మే ఽస్తు, అనిరాకరణం మమ. 18

ఇతి వేదాంతమూర్ధన్యే, ఛాంధోగ్యే, ఽస్య ప్రపంచనాత్,
ప్రారభ్య తత్పరిత్యాగో, న తస్య శ్రేయసే మతః. 19

నాబ్రహ్మవిత్కులే తస్య, జాయతే హి కదాచన,
న దారిద్ర్యం కులే తస్య, యావత్ స్థాస్యతి మేదినీ. 20

ప్రతిసంవత్సరం కుర్యా, చ్ఛారదం వార్షికం తథా,
తేన సర్వ మవాప్నోతి, సురాసురసుదుర్లభమ్. 21

అన్య చ్చ యద్యత్కల్యాణం, జాయతే తత్క్షణే క్షణే,
సత్యం సత్య మిదం సత్యం, గోపనీయం ప్రయత్నతః. 22

పుత్రాయ బ్రహ్మనిష్ఠాయ, పిత్రా దేయం మహాత్మనా,
అన్యథా దేవతా తస్మై, శాపం దద్యా న్న సంశయః. 23

ఇతి శ్రీరహస్యాగమే గురుకీలకమ్

## 2. రహస్యాంతం (రహస్యత్రయం)

**చరిత్రాని జపేత్ త్రీణి సరహస్యా న్యతంద్రితః** (ఖిలమార్కండేయం)

1. ప్రాధానికరహస్యం 2. వైకృతికరహస్యం, 3. మూర్తిరహస్యం – అనే రహస్య

త్రయం అంతంలో అంటే సప్తదశీ 13 అధ్యాయం అనంతరం పారాయణం చేయాలి. ప్రణవాదిగా 13 అధ్యాయాలకు ముందు కవచ,అర్గళ,కీలకాలు 3 చేసినట్లు రహస్యాంతంగా ప్రాధానిక, వైకృతిక, మూర్తి రహస్యత్రయం 13 అధ్యాయాల తర్వాత చేయడం అనేమార్గం క్షుణ్ణంగా ఉంది.

రహస్యం అంటే దేవీప్రభావాన్ని గురించి చెప్పేది అని అర్థం. ఇది సప్తశతిలోని ఏకాదశ, ద్వాదశ, త్రయోదశ అధ్యాయాలలో చెప్పబడింది కాబట్టి రహస్యం - 11, 12, 13 అధ్యాయాలు (చూ.పుట 6, 7) అంతంలో చివర పారాయణ చేయాలి, అని ఒకమతం. ఇది అప్రసిద్ధం.

## 3. చరిత్రత్రయం

చరిత్రత్రయం అంటే ప్రధాన మైన 13 అధ్యాయాల సప్తశతి.

| | |
|---|---|
| సప్తశతిలో ప్రథమాధ్యాయం | ప్రథమచరిత్ర |
| 2, 3, 4 అధ్యాయాలు | మధ్యమచరిత్ర |
| 5 నుండి 13 అధ్యాయాలు | ఉత్తమచరిత్ర (చూ.పుట 6) |

ప్రణవాది, రహస్యాంతంగా ఈచరిత్రత్రయం ఉండాలి. అంటే సప్తశతి ప్రణవానికీ రహస్యానికీ మధ్యలో ఉండాలి. అపుడు మొదట 1. కవచం 2. అర్గళం 3. కీలకం (ప్రణవాది) తర్వాత చరిత్రత్రయం (సప్తశతి). ఆతర్వాత 1. ప్రాధానిక 2. వైకృతిక 3. మూర్తి రహస్యత్రయం అనేక్రమంలో సప్తశతిపారాయణం పూర్వంలో మూడూ, ఉత్తరంగా మూడూ అంగాలతో షడంగంగా జరుగుతుంది.

పారాయణలో ప్రత్యేకంగా అంగంగా పరిగణింపబడకుండా మరి కొన్ని విశేషాంశాలు అనుష్ఠింపబడతాయి.

## 4. నవార్ణమంత్రం

**శత మాదౌ శతం చాంతే, జపే న్మంత్రం నవార్ణకమ్,**

**చండీ సప్తశతీం మధ్యే, సంపుటో ఽ యముదాహృతః.** (డామరతంత్రం)

**మధ్యే నవార్ణపుటితం కృత్వా, స్తోత్రం స దాభ్యసేత్.** (చిదంబరసంహిత)

శత మంటే అష్టోత్తరశతం (108) సప్తశతికి ముందూ, చివరా, నవార్ణమంత్రం

కనీసం 108 పర్యాయాలు జపించాలి.

మొదట అంటే కవచ, అర్గళ, కీలకాలకు తర్వాత, చివర అంటే రహస్య త్రయానికి ముందూ నవార్ణమంత్రం జపించాలి.

**నవార్ణమంత్రం - అర్థం**

**ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే.**

ఈమంత్రంలో అక్షరాలు తొమ్మిది. అందుకని ఈమంత్రం నవార్ణం.

ఐం - (వాగ్భవబీజం) మహాసరస్వతి. హ్రీం - (మాయాబీజం) మహాలక్ష్మి, క్లీం - (కామబీజం) మహాకాళి, చాముండాయై = (చముం - ఆకాశరూప సేనను, డా(లా)తి = తనరూపంతో నశింపజేసినది) బ్రహ్మవిద్యకోసం, విత్ (జ్ఞానం) చిత్తు చ=(సత్తు), ఈ(ఏ) = ఆనందం, విత్ - చ - ఈ (విచ్చే) అనేవి ఐం హ్రీం క్లీం లకు విశేషణాలు, సంబోధనాంతాలు.

చిద్రూప అయిన మహాసరస్వతీ (విత్ - ఐం), సద్రూప అయిన మహాలక్ష్మీ (చ-హ్రీం) ఆనందరూప అయినమహాకాళీ (ఇ-క్లీం), బ్రహ్మవిద్యకోసం (చాముండాయై) నిన్ను, చండిని ధ్యానిస్తున్నాను. ఈఅర్థాన్నే

**అఖండబ్రహ్మవిద్యాయై చిత్ సద్ ఆనందరూపిణి,**
**అనుసందధ్మహే వయం త్వాం హృదయాంబుజే** అని డామరతంత్రమూ

**మహాసరస్వతి చిదే, మహాలక్ష్మి సదాత్మికే,**
**మహాకా ళ్యానందరూపే, తత్త్వజ్ఞానసిద్ధయే,**
**అనుసందధ్మహే చండి! వయం త్వాం హృదయాంబుజే.** అని రహస్యతంత్రమూ చెప్పాయి.

**యస్మా చ్చండం చ ముండం చ, గృహీత్వా త్వ ముపాగతా,**
**చాముం దేతి తతో లోకే, విఖ్యాతా దేవి! భవిష్యసి.**

చండతూల ముండమాల అనేఅవిద్యలను నరికివేయడంవల్ల చాముండా. అంటే బ్రహ్మవిద్య. కాబట్టి మంత్రంలో చాముండా శబ్దాన్నిబట్టి ఇది చండీనవాక్షరీమంత్రం కా దని గానీ, చండీ - చాముండలు భిన్న లనీ గానీ భావించరాదు.

# 5. రాత్రి - దేవీసూక్తాలు

**రాత్రిసూక్తం పఠే దాదౌ, మధ్యే సప్తశతీస్తవమ్,**
**ప్రాంతే తు పఠనీయం వై, దేవీసూక్త మితి క్రమః.** (మరీచికల్పం)

సప్తశతికి ముందు రాత్రిసూక్తం, చివర దేవీసూక్తం చెప్పాలి.

**నవార్ణకమనుం జప్త్వా, రాత్రిసూక్తం తత స్తవమ్.**
**దేవీసూక్తం నవార్ణం చ, పఠే దితి క్రమో ఽ స్తి హి.** (మరీచికల్పం)

మొదట అంటే (కవచ, అర్గళ, కీలక) నవార్ణమంత్రజపానికి తర్వాత, రాత్రిసూక్తమూ (చివర) నవార్ణమంత్రజపా(రహస్యత్రయా)నికి ముందు దేవీసూక్తమూ పఠించాలి. అంటే సప్తశతికి పూర్వంలో 1. కవచ, 2. అర్గళ, 3. కీలక, 4. నవార్ణమంత్రజప, 5. రాత్రిసూక్తాలూ సప్తశతికి తర్వాత 1. దేవీసూక్త, 2. నవార్ణమంత్రజప 3, 4, 5 రహస్యత్రయమూ అనేక్రమంలో పారాయణం అవుతుంది.

**మతాంతరం**

**రాత్రిసూక్తం నవార్ణం చ, తత స్సప్తశతీస్తవమ్,**
**నవార్ణం దేవీసూక్తం చ, పఠే ది త్యపి చోచిరే.**

అని మరీచికల్పం మతాంతరం ప్రస్తావించింది. దీనిప్రకారం ముందు రాత్రిసూక్తం, దేవీసూక్తం తర్వాత నవార్ణమంత్రజపం. చివరలో సప్తశతికి తరువాత ముందుగా నవార్ణమంత్రజపం చేసి, ఆతర్వాత దేవీసూక్తం చెప్పడం అని క్రమం. రాత్రిదేవీసూక్తాలూ, నవార్ణమంత్రజపం అనేవాటిముందువెనుకలు మారుతాయి. రాత్రిసూక్తం, నవార్ణజపం, సప్తశతి – నవార్ణజపం, దేవీసూక్తం అని క్రమం. కాని పూర్వోక్త మైన – నవార్ణజపం, రాత్రిసూక్తం, సప్తశతి, దేవీసూక్తం, నవార్ణజపం అనేక్రమమే ప్రచురంగా వాడుకలో ఉంది.

**రాత్రిదేవీసూక్తాలస్వరూపం**

ఈసూక్తాలు రెండు విధాలు. 1. వైదికం 2. పౌరాణికం. ఋగ్వేదమంత్రాలతో కూడినవి వైదికాలు.

మార్కండేయపురాణం సప్తశతిలోనిప్రథమాధ్యాయంలో 53వ శ్లోకం (విశ్వేశ్వరీమ్) నుంచి 67 శ్లోకం (ప్రబోధం చ మహాసురౌ) వరకు 15 శ్లోకాలు

పౌరాణికరాత్రిసూక్తం. అలాగే పంచమాధ్యాయంలోని 7 శ్లోకం (నమో దేవ్యై) నుండి 36 శ్లోకం (యా సాంప్రతం... భక్తివినమ్రమూర్తిభిః) వరకు 30 శ్లోకాలు పౌరాణికదేవీసూక్తం. వైదిక, పౌరాణికాలలో ఏఒక్కటైనా పారాయణం చేయవచ్చు. వైదికసూక్తానికే ప్రాధాన్యం అంటారు. వేదపాఠం అవకాశం లేనివారికి పౌరాణికం పారాయణం. దీన్నే తాంత్రికం అనీ అంటారు.

## 6. న్యాసం

**న్యాసహీనో భవే న్మూకో మృత స్స్యాచ్ఛిరసా వినా.**

అని వారాహీతంత్రం న్యాసప్రాధాన్యం చెపుతున్నది. న్యాసం లేకపోతే మూగవాడై, శిరసు ఖండింపబడి మరణించేంతటిఅనర్థం ఉన్నది. మంత్రానికి (ఋష్యాది) న్యాసం ప్రధానం. సప్తశతిలో మూడుచరిత్రలకు పూర్వంలో ఋష్యాదిన్యాసం చెప్పబడింది. సప్తశతి మాలామంత్రం. కాబట్టి ఆమంత్రాని(సప్తశతి)కి న్యాసం చేసుకోవాలి.

**ఖడ్గినీ శూలినీ** అనే కాళీస్తవ్యమంత్రం ఒకటీ, **శూలేన పాహి, ప్రాచ్యాం రక్ష సౌమ్యాని యాని, ఖడ్గశూలగదాదీని** అనే లక్ష్మీస్తవ్యమంత్రాలు నాలుగూ, **సర్వస్వరూపే** అనే సరస్వతీస్తవ్యమంత్రం ఒకటి, ఈఆరింటితో కరహృదయాదిన్యాసం చేసుకోవాలి. ఈన్యాసం సప్తశతీమాలామంత్రానికి అంటే 13 అధ్యాయాలకు మొదటా, 13 అధ్యాయాలకు చివరా చేసుకోవాలి.

నవార్ణజపం ప్రధానమూ, సప్తశతి తదంగమూ అయినచోట ఈన్యాసాలు నవార్ణజపానికి పూర్వం తదంగంగా చేయబడతాయి. సప్తశతిపాఠం ప్రధానం అయినపుడు సప్తశతికి పూర్వం తదంగంగా ఉంటాయి. ఇవి సప్తశతికి ఉత్తరాంగంగా లేకపోవడం గమనించాలి.

### ఏకాదశన్యాసాలు

**తత ఏకాదశ న్యాసాన్ కుర్యా దిష్టఫలప్రదాన్** అని మేరుతంత్రం. రాత్రిసూక్తం తర్వాత మాతృకాదిన్యాసాలు 11 చేయా లన్నది.

**అన్యన్యాసోక్తఫలదం కుర్యా దేకాదశం తతః** (మేరుతంత్రం)
**అయ మేకాదశన్యాసో దశన్యాససమో భవేత్.**

**తత్ఫలం లభ్యతే సర్వం మస్మి న్నేకాదశే కృతే** (ఖిలమార్కండేయం)

అన్నమాటలనుబట్టి పదకొండో(బీజత్రయ)న్యాసం ఒక్కటి చేసినా, మిగిలిన పది న్యాసాలు గూడా చేసినఫలితం సిద్ధిస్తుంది. కాబట్టి ఆశక్తులకు పదకొండో న్యాసం ఒకటి చేసినా చాలు. ఈబీజత్రయన్యాసమే లఘుకవచ, అర్గళ, కీలకాలుగా (చూ.పుట 26) కొందరు పేర్కొంటారు.

## 7. శాపోద్ధారాదులు

పారాయణం ప్రారంభంలో 1. శాపోద్ధారం 2. ఉత్కీలనం 3. పుస్తకపూజ అనేవి సాధారణంగా జరుగుతున్నాయి. ఇవి పారాయణాంతంలో ఉండవు. దీనిలో కూడా సంప్రదాయభేదాలు ఉన్నాయి. అసలు పారాయణం యంత్రాదులలో చండిని అర్చించినతర్వాతనే ప్రారంభిస్తారు. ఇ వన్నీ మరి కొన్నింటితో వారివారిసంప్రదాయా లనుబట్టి ఆచరింపబడుతున్నా, అవి సప్తశతిఅంగాలుగా నియమంగా పరిగణింప బడవు.

# సప్తశతీపాఠం

మొత్తంమీద (సప్తశతికి) పూర్వంలో 1. కవచం, 2. అర్గళం 3. కీలకం 4. నవార్ణజపం 5. రాత్రిసూక్తం, 6. సప్తశతీమాలామంత్రన్యాసమూ, తర్వాత సప్తశతీ మాలామంత్రం 13 అధ్యాయాలు. తర్వాత 1. ఉత్తర(సప్తశతీమాలామంత్ర)న్యాసం 2. దేవీసూక్తం 3. నవార్ణమంత్రజపం, 4, 5, 6 రహస్యత్రయమూ పారాయణం చేయడం అనేది సప్తశతీపారాయణవిషయక్రమంగా ప్రసిద్ధం (సర్వ)సాధారణం.

## 1. షడంగసప్తశతి

**అంగహీనో యథా దేహీ, సర్వకర్మాసు న క్షమః,**
**అంగషట్కవిహీనా తు, తథా సప్తశతీస్తుతిః.** (కాత్యాయనీతంత్రం)

అవయవాలు తగ్గినమనిషి పనులు చేయడానికి ఎలా సమర్థుడు కాడో, అలా అంగాలు ఆరూ లేకుండా సప్తశతి కూడా ఇష్టఫలాన్ని ఇవ్వదు.

**అంగషట్కం విజానీయాత్, కవచార్గళకీలకైః,**
**రహస్యత్రితయై నైవ, సప్తశత్యా మహామనోః.** (కాత్యాయనీతంత్రం)

పూర్వంలో 1. కవచం 2. అర్గళం 3. కీలకం చివరలో 1. ప్రాధానిక 2. వైకృతికం 3. మూర్తిరహస్యాలు మొత్తం కలిసి ఆరూ సప్తశతికి అంగాలు కాబట్టి ఇది షడంగం. (రాత్రిసూక్త, దేవీసూక్త, నవార్ణమంత్రాదులు అంగాలుగా పరిగణింబడలేదు. ఈ సప్తశతిఅంగాలవిషయంలో భేదా లున్నాయి.)

## 2. నవాంగసప్తశతి

**న్యాస మావాహనం చైవ, నామా న్యర్గళకీలకే,**
**హృదయం చ దళం చైవ, ధ్యానం కవచ మేవ చ.**
**మాహాత్మ్యం జపే న్నిత్య, మష్టమ్యాం చ విశేషతః .** (బృ.స్తో.పుట517)

న్యాసం వగైరా తొమ్మిదిఅంగాలు కలిగి, యిది నవాంగం అవుతున్నది. తొమ్మిదీ పఠించాక దేవీమాహాత్మ్యం (సప్తశతి) పఠించాలి. కాబట్టి యీనవాంగాలు సప్తశతికి పూర్వంలోనే ఉంటాయి.

ఈపద్ధతిలో సప్తశతితర్వాత ఉత్తరాంగంలో మ రేమీ కనబడదు.

## 3. ఏకాదశాంగసప్తశతి

ఇందులో సప్తశతికి పూర్వం (షడంగంలో) కవచ, అర్గళ, కీలకాలు మూడూ అయ్యాక హృదయం, ధ్వజం, అనేవి రెండు అధికంగా ఉంటాయి. ఉత్తరాంగంలో (షడంగంలోని) రహస్యత్రయం అయ్యాక, సరస్వతీ, లక్ష్మీ, కాళీ - సూక్తత్రయం ఉంటాయి. కాబట్టి సప్తశతికి పూర్వంలో అయిదూ, తర్వాత ఆరూ అంగాలుగా ఉన్నదీన్ని ఏకాదశాంగం అనవచ్చు. (దుర్గాసప్తశతీ)

## 4. ద్వాదశాంగసప్తశతి

ఏకాదశాంగంలోనిఅంగాలే కొంచెం క్రమంలో తేడాతో 1. అర్గళం, 2. కీలకం 3. కవచం 4. హృదయం 5. ధ్వజం అని పూర్వంలోనూ సూక్తత్రయం ముందూ, రహస్యత్రయం తర్వాతాగా ఉత్తరాంగంలోనూ ఉంటాయి. ఇంక పూర్వంలో అయిదింటితోపాటు సప్తశతీమాలామంత్రన్యాసం ఒకటి అధికం. మిగిలినవిధానాల్లో ఉన్న సప్తశతీమాలామంత్రన్యాసం ఇందులో లేదు, దానికీ ఇందులోనిఈన్యాసానికి బేధమూ ఉంది. ఇంకా ఈన్యాసం - ఉత్తరాంగంగా చేయబడటం లేదు. కాబట్టి ఈన్యాసాన్ని ప్రత్యేకంగా సప్తశత్యంగంగా గ్రహిస్తే ఇది ద్వాదశాంగం అవుతుంది. నిర్ణయం తద్జ్ఞులదే.

# సప్తశతి - అంగభేదాలు

| శ్రీచండీసప్తశతి సాధన | బృహత్స్తోత్ర రత్నాకరం | శ్రీదేవీపూజ ఏకాదశాంగం | శ్రీదుర్గాసప్తశతి ద్వాదశాంగం |
|---|---|---|---|
| 1. కవచం | 1. న్యాసం | 1. కవచం | 1. అర్గళం |
| 2. అర్గళం | 2. ఆవాహనం | 2. అర్గళం | 2. కీలకం |
| 3. కీలకం | 3. నామాలు | 3. కీలకం | 3. కవచం |
| | 4. అర్గళం | 4. హృదయం | 4. హృదయం |
| | 5. కీలకం | 5. ధ్వజం | 5. ధ్వజం |
| | 6. హృదయం | | 6. న్యాసం |
| | 7. దళం | | |
| | 8. ధ్యానం | | |
| | 9. కవచం | 6. ప్రాధానిక రహస్యం | 7. సరస్వతీసూక్తం |
| 4. ప్రాధానికరహస్యం | | 7. వైకృతిక రహస్యం | 8. లక్ష్మీసూక్తం |
| 5. వైకృతికరహస్యం | | 8. మూర్తి రహస్యం | 9. కాళీసూక్తం |
| 6. మూర్తిరహస్యం | | 9. సరస్వతీసూక్తం | 10. ప్రాధానిక రహస్యం |
| | | 10. లక్ష్మీసూక్తం | |
| | | 11. కాళీసూక్తం | 11. వైకృతిక రహస్యం |
| | | | 12. మూర్తి రహస్యం |

ఇంకా మ రే మైనా సంప్రదాయాభేదా లున్నా యేమో పరిశీలించి తెలుసుకోవాలి.

# సప్తశతీసమగ్రపారాయణక్రమం

స్నానసంధ్యాదు లైననిత్యకర్మలను పూర్తిచేసినతర్వాత సాధకుడు జపమందిరంలో ప్రవేశించి, ఆసనాన్ని సంస్కరించుకోవాలి. అక్కడ కూర్మచక్రం వ్రాయాలి. దానిలో ఆధారశక్తి మొదలుగా పీఠదేవతలను పూజించాలి. దానిపై దర్భాసనం, జింకచర్మం, కంబళి, వస్త్రం వీటిలో లభ్య మైనవాటిని పరచుకోవాలి. భూమిని ప్రార్థించి, ఆసనానికి ఆగ్నేయాదికోణాల్లో గణపతిప్రభృతులకు నమస్కరించాలి. సిగ ముడివేసుకోవాలి. త్రిఖండముద్ర వేసి, సదాశివమండలం భావనచేసి స్తుతించాలి. గురు, గణపతి, దిక్పాలకులకు నమస్కరించాలి. (పాపం శమింపజేసుకోవాలి). తర్వాత భైరవుడిఅనుమతి తీసుకోవాలి. తర్వాత తత్త్వాచమనం ప్రాణాయామం చేయాలి. పిదప సప్తశతీ

పారాయణసంకల్పం చేయాలి. తర్వాత (గురుత్రయాన్ని మహాపాదుకను స్మరించాలి). గురుప్రభృతులకు నమస్కరించాలి. భూతోచ్చాటనం విఘ్నోత్సారణం చేసుకోవాలి. తర్వాత దిగ్బంధనం చేసుకొని, అగ్నిప్రాకారముద్ర వేసి, శూలముద్రతో ఆత్మరక్ష చేసుకోవాలి.

తర్వాత మళ్ళీ ప్రాణాయామం చేసి, బాహ్యాంతరభూతశుద్ధి, తర్వాత స్వప్రాణ ప్రతిష్ఠ చేయాలి. మాతృకలతో ప్రాణాయామం చేసి, మాతృకావ్యాపకన్యాసం, అంతర్మాతృకాన్యాసం, బహిర్మాతృకాన్యాసం, కళాన్యాసం చేసుకోవాలి. ఇంతవరకు కొంచె మించుమించుగా అన్ని(పారాయణ)మతాల్లోనూ ఒక్కలాగే ఉన్నాయి. (కొందరు తత్త్వాచమనం, సంకల్పం చేసి, శాపోద్ధారాదులతో సప్తశతీపారాయణం ప్రారంభిస్తారు).

తర్వాత శాపోద్ధారాదులతో సప్తశతీపారాయణం ప్రారంభించాలి. ఇక్కడ కొన్ని సంప్రదాయభేదాలు కన్పిస్తున్నాయి.

## సంప్రదాయభేదాలు - పూర్వాంగం

1. శాపోద్ధారానికి బదులుగా ద్వాదశాంగంలో బ్రహ్మశాపవిమోచనం చెప్తారు. (62పుట) కొందరు. ఇందులో శాపోద్ధార, ఉత్కీలనాలు లేవు.
2. కొందరు చండీశాపవిమోచనమంత్రం చెప్తారు (గీతాప్రెస్ 63 పుట).
3. కొందరు పుస్తకపూజను శాపోద్ధార, ఉత్కీలనాలకు ముందు చేస్తే, కొందరు (షడంగవిధానం) తర్వాత చేస్తారు.
4. షడంగ, నవాంగ, ఏకాదశాంగ, ద్వాదశాంగంగా సప్తశత్యంగం భిన్నంగా ఉండడం ఇంతకు ముందు ప్రస్తావింపబడింది.
5. కవచం, అర్గళం, కీలకం అనేక్రమంలో పఠిస్తే, కొందరు వాటిని అర్గళం, కీలకం, కవచం అనేక్రమంలో చెప్తారు.

**అర్గళం కీలకం చాదౌ పఠిత్వా కవచం పఠేత్**
**భవేత్ సప్తశతీం పశ్చాత్ క్రమ ఏష శివోదితః.**

(ద్వాదశాంగంలోను, నవాంగంలోనూ ఇంతే) కవచాదుల్లో కూడా నవాంగ ప్రభృతుల్లో పాఠభేదాలు కన్పిస్తాయి. అలాగే ఋషిన్యాసాదులలోనూ భేదం–73 పుట.మొ.

6. వీటితర్వాత ఏకాదశ, ద్వాదశాంగాల్లో హృదయధ్వజాలు, నవాంగంలో ధ్వజానికి బదులుగా దళం ఉన్నాయి. హృదయం కూడా నవాంగంలో భిన్నరూపంలో ఉంది.
7. ద్వాదశాంగంలోని శ్రీసప్తశతికామాలామంత్రన్యాసం (పుట92) మిగిలినవాటిల్లో సప్తశతిమాలామంత్రన్యాసంకంటే భిన్నంగా ఉంది.
8. ఇక్కడ ఉన్న శంభుతేజోజ్జ్వలేత్యాది కరహృదయాదిన్యాసం ఏకాదశాంగంలో చక్రన్యాసం అనేపేరుతో ఉంది.
9. అక్కడ చండీపంచాక్షరన్యాసం అని సప్తశతికామాలామంత్రన్యాసాల్లో చెప్పిన న్యాసం ఇతరత్ర ఎక్క డైనా ఉన్న దేమో చూడాలి.
10. మాతృకాది ఏకాదశన్యాసాదులు షడంగాదుల్లో ఉండగా, ద్వాదశాంగాదుల్లో కనిపించదు. ఏకదశాంగంలో నవార్ణమంత్రజపాంగంగా తత్పూర్వం ఈ న్యాసాలు చేయడం కనిపిస్తున్నది.
11. నవార్ణమంత్రజపంలో కూడా ఋషిన్యాసంలో భేదా లున్నాయి. (101పుట)
12. ద్వాదశాంగంలో నవార్ణమంత్రజపంలో సప్తశతీమంత్రోత్కీలకం, అర్గళోత్కీలనం (పుట. 103) గాయత్రీశాపోత్కీలనం నవార్ణమంత్రోద్ధారం విశేషాలు
13. ఏకాదశాంగంలో – సప్తశతీమాలామంత్రన్యాసం తర్వాత చండీపంచాక్షర న్యాసం, చక్రన్యాసం (ఇది ద్వాదశాంగంలో మరోచోట ఉంది) ధ్యానం ఉన్నాయి.

తర్వాత సప్తశతి 13 అధ్యాయాలపారాయణం. ఇందులో భేదా ల్లే వనవచ్చు.

## సంప్రదాయభేదాలు - ఉత్తరాంగం

1. నవాంగంలో సప్తశతిలోనిత్రయోదశాధ్యాయంతో సప్తశతీపారాయణ పూర్తవుతున్నది.
2. సప్తశతీమాలామంత్ర ఉత్తరన్యాసం ద్వాదశాంగంలో సప్తశతికి ముందూ లేదు వెనుకా లేదు.
3. ఏకాదశన్యాసాలు, ఉత్తరన్యాసాల్లో ఏవిధానంలోనూ లేవు.
4. ఏకాదశాంగంలో పూర్వాంగంలో ఉన్నచక్రన్యాసం ఉత్తరాంగంలో లేదు. చండీ

పంచాక్షరన్యాసం, ధ్యానం ఉన్నాయి.

5. ఏకాదశాంగంలో ముందు రహస్యత్రయం తర్వాత సూక్తత్రయం ఉండగా, ద్వాదశాంగంలో రహస్యత్రయం తర్వాత సూక్తత్రయం ఉన్నాయి. ప్రథమ మధ్యమోత్తమచరిత్రలలో శ్రీకాళీ, లక్ష్మీ, సరస్వతుల చరిత్ర లున్నాయి. కాబట్టి ఉత్తరాంగంలో ఉపసంహారక్రమంలో సరస్వతితో ప్రారంభ మై, లక్ష్మీ, కాళీ సూక్తా లుండడంలో క్రమం ఉంది.
6. సంహారజపక్రమం అనేపేరుతో ద్వాదశాంగంలో సూక్తరహస్యత్రయం తర్వాత మళ్ళీ సప్తశతీత్రయోదశాధ్యాయపాఠం కనిపిస్తుంది.
7. ఇందులోనూ, ఏకాదశాంగంలోనూ మళ్ళీ ఉత్కీలనం, మంత్రజపం ఉన్నాయి.

# సప్తశతీసమగ్రపారాయణక్రమభేదాలు - పూర్వాంగం

| షడంగం | నవాంగం | ఏకాదశాంగం | ద్వాదశాంగం |
|---|---|---|---|
| - | పుస్తక పూజ | పుస్తకపూజ | పుస్తకపూజ |
| శాపోద్ధారం | శాపోద్ధారం | శాపోద్ధారం | - |
| ఉత్కీలనం | ఉత్కీలనం | ఉత్కీలనం | - |
| పుస్తకపూజ | | | |
| శాంతిపాఠం | - | - | - |
| - | నవార్ణమంత్రజపం | - | - |
| - | న్యాసం, ఆవాహనం | - | - |
| - | నామాని | - | - |
| కవచం | - | కవచం | - |
| అర్గళం | అర్గళం | అర్గళం | అర్గళం |
| కీలకం | కీలకం | కీలకం | కీలకం |
| - | - | - | కవచం |
| - | హృదయం (భిన్నం) | హృదయం | హృదయం |
| - | - | ధ్వజం | ధ్వజం |
| - | దళం, ధ్యానం, కవచం | | - - |
| - | - | - | మాలాస్తోత్రచక్రన్యాసం |
| - | - | - | నవార్ణమంత్రన్యాసం |
| - | - | - | సప్తశతీమంత్రోత్కీలనం |
| - | - | - | అర్గళోత్కీలనం |
| - | - | ఏకాదశన్యాసాలు | - |
| - | - | మూలషడంగన్యాసం | - |
| - | - | నవార్ణమంత్రజపం | నవార్ణమంత్ర జపం |
| రాత్రిసూక్తం | - | రాత్రిసూక్తం | రాత్రిసూక్తం |
| ఏకాదశన్యాసాలు | - | - | - |
| సప్తశతీమాలా మంత్రన్యాసం | - | - | సప్తశతీమాలా మంత్రన్యాసం |

# ఉత్తరాంగం

| | | | |
|---|---|---|---|
| సప్తశతీమాలామంత్ర | - | సప్తశతి మాలామంత్ర | - |
| ఉత్తరన్యాసం | - | ఉత్తరన్యాసం | - |
| ధ్యానం | - | ధ్యానం (భిన్నం) | - |
| దేవీసూక్తం | - | దేవీసూక్తం | దేవీసూక్తం |
| నవార్ణమంత్రజపం | - | నవార్ణమంత్రజపం | నవార్ణమంత్రజపం |
| - | - | - | సరస్వతీ సూక్తం |
| - | - | - | లక్ష్మీ సూక్తం |
| - | - | - | కాళీ సూక్తం |
| ప్రాధానికరహస్యం | - | ప్రాధానికరహస్యం | ప్రాధానికరహస్యం |
| వైకృతికరహస్యం | - | వైకృతికరహస్యం | వైకృతికరహస్యం |
| మూర్తిరహస్యం | - | మూర్తిరహస్యం | మూర్తిరహస్యం |
| - | - | సరస్వతీ సూక్తం | - |
| - | - | లక్ష్మీ సూక్తం | - |
| - | - | కాళీ సూక్తం | - |
| - | - | ఉత్కీలనం | - |
| - | - | - | సంహారజపం |
| - | - | - | ఉత్కీలనం |
| - | - | - | యంత్రదేవత పూజాధికం |

అపరాధస్తవం

మరో విధానంలో చండీనవాక్షరీమంత్రోత్కీలనం, చండీనవాక్షరీమంత్రవర్ణ దిక్న్యాసం, ఏకాదశన్యాసాలు, నవార్ణజపం, కవచం, అర్గళం, కీలకం (లక్ష్మీకీలకం) గురుకీలకం, రాత్రిసూక్తం, చండీసప్తశతీమూలమంత్రన్యాసం లేదా చక్రన్యాసం – పూర్వాంగంలోనూ, సప్తశతి తర్వాత ఉత్తరాంగంలో ఉత్తరన్యాసం, దేవీసూక్తం రహస్యత్రయం, మహాలక్ష్మీ(మహిషాంతకరీ)సూక్తం, (సప్తశతి చతుర్థాధ్యాయం) మహాసరస్వతీ (నారాయణీ) సూక్తం (11 అధ్యాయం) మృత్యునివారణంస్తోత్రం అనేక్రమం కనిపిస్తుంది.

## మృత్యునివారణస్తోత్రం

1. శూలేన పాహి (5-23)  2. ప్రాచ్యాం రక్ష (5-24)

3. సౌమ్యాని యాని (5-25)  4. ఖడ్గశూలగదాదీని (5-26)

ఈనాలుగుశ్లోకాలకు మృత్యునివారణస్తోత్రం అని పేరు. ఈశ్లోకాలకే లఘుకవచం అనేవ్యవహారం, మొదట్లో ఏకాదశన్యాసాలలో 11వ న్యాసంగాలలోని హ్రీం బీజన్యాసంగానూ చూశాం. ఈరక మైనభేదాధిక్యం కూడా చండీసప్తశతీ ఉపాసన ఎంతగా బహుముఖంగా లోకంలో విస్తరించిందో నిరూపిస్తున్నది.

# సప్తశతీపారాయణం - లఘువిధానం

## 1. మూడు రోజులపారాయణం

ఒకరోజులో మొత్తం పారాయణం చేయలేనివారు రోజు కొకచరిత్ర చొప్పున 3 రోజుల్లో ఒకఆవృతంగా పారాయణం చేయవచ్చు నని కొంద రంటారు.

## 2. ఏడురోజులపారాయణం

| | | | |
|---|---|---|---|
| మొదటిరోజు | అర్గళ, కీలక, కవచాలు | ప్రథమాధ్యాయం | |
| రెండోరోజు | 2, 3 అధ్యాయాలు | మూడోరోజు | 4 అధ్యాయం |
| నాల్గోరోజు | 5,6,7,8 అధ్యాయాలు | ఐదోరోజు | 9,10 అధ్యాయాలు |
| ఆరోరోజు | 11 అధ్యాయం | ఏడోరోజు | 12,13 అధ్యాయాలు |

క్రమం తప్పకుండా పారాయణం చేస్తే అది సప్తాహపారాయణం అవుతుంది. నవార్ణజపం రోజూ చేయాలి. పదోరోజు రహస్యత్రయం విడిగా చెప్పవచ్చు.

ఇది లఘువిధానం. కాబట్టి ఫలితం గూడా లఘుప్రకారంలోనే ఉన్నా, ఈ రక మైనపారాయణ గూడా చేయవచ్చు నని తద్జ్ఞులమతం.

## 3. మధ్యమచరిత్రపారాయణం

మధ్యమచరిత్రం ఒక్కటి పారాయణం చేయడం మరి కొంత లఘువిధానం అవుతుంది.

కాని **ఏకేన వా మధ్యమేన నైకే నేతరయో రిహ**
**చరితార్ధం తు న జపే జ్జపన్ ఛ్ఛిద్ర మవాప్నుయాత్**
**చరితాని జపే త్రిణి సరహస్యా న్యతంద్రితః ॥**
**చరితం మధ్యమం చైషాం భవే ద్వా చండికామయమ్.** అని ఖిలమార్కండేయం

మధ్యమచరిత్ర ఒక్కటి పారాయణ చేయవచ్చు గాని, మిగిలినచరిత్రలు మాత్రమే పారాయణం చేయడం తగ దనీ, చరిత్ర మధ్యలో ఆగితే నష్టం కూడా కలుగుతుందని చెపుతున్నది. అందుచేత 3 రోజులు లేదా 7 రోజుల పారాయణం చేయడం తగదు. ఒకరోజులోనే మొత్తం గానీ అసాధ్య మనుకుంటే మధ్యమచరిత్ర మాత్రమే గానీ ఒక్కరోజులోనే పారాయణం చేయాలి. కాని మరీ అశక్తతలో అసలు మానేయడంకంటే యథాశక్తి పారాయణం చేయడం మేలే అని కొందరంటారు. వారంరోజుల్లో పారాయణం చేసేపద్ధతి ఎక్కువ ప్రచారంలో గూడా ఉందట కొన్ని ప్రాంతాల్లో.

## 4. చండీస్తోత్రపారాయణం

ఇలా కాకపోతే చతుష్పది, దేవీస్తోత్రచతుష్టయం (పుట.11) పారాయణం చేయవచ్చు. మొదట కవచ, అర్గళ, కీలకాలు చెప్పి, నవార్ణం 108 సార్లు జపించి రాత్రిసూక్తం పఠించి, సప్తశతీమంత్రన్యాసం చేసుకోవడం, చివర ఉత్తరన్యాసం, నవార్ణమంత్రజపం. ఇది అన్నింటికీ సామాన్యం.

## 5. దేవీసూక్తపారాయణం

పై స్తోత్రచతుష్టయంలోనూ దేవీసూక్తం ఒక్కటి పారాయణం చేయడం మరీ లఘువిధానం, **స చ వైశ్య స్తప స్తేపే దేవీసూక్తం పరం జపన్.** (13అ.7శ్లో)

## 6. సప్తశ్లోకీసప్తశతీపారాయణం

మరీ అసాధ్యం అయిపోతే సప్తశ్లోకీసప్తశతీపారాయణం అత్యంతలఘువిధానం, చూ. చివరిపుట.

# చండీపాఠభేదాలు - 1

ఈచండీసప్తశతిపారాయణవిధానంలో కొన్నిభేదాలు పేర్కొనబడ్డాయి.

## నిత్యచండీపారాయణం

**శ్లో॥ శుక్లాం భూతా మవష్టభ్య మాసం ప్రతిదినం జపేత్,**
**సకృద్రహస్యసంయుక్తచండికాచరితత్రయమ్.**
**దశాంశహోమసహితం సోచ్యతే నిత్యచండికా.**

శుక్లపక్ష చతుర్దశిరోజున ప్రారంభించి అర్గళ, కీలక, కవచాలనూ చరిత్రత్రయ రహస్యాదులనూ, రోజు కొకసారి చొప్పున నెలరోజులు క్రమం తప్పకుండా పారాయణ చేయడం నిత్యచండీపారాయణం.

## నవదుర్గావిధానం

**శ్లో॥ శుక్లాష్టమీ మావష్టభ్య యావచ్ఛుక్లచతుర్దశీ,**
**నవదుర్గా విధాతవ్యా సర్వకామ్యఫలార్థినా.**
**ప్రణవాదిరహస్యాంతం చండికాచరితత్రయమ్**
**నవాహం భూయ ఏకైకం మౌనీ బద్ధాసనో జపేత్.**

శుక్లాష్టమి మొదలు శుక్లచతుర్దశి వరకు ఏడు రోజులలో నవపారాయణాలు చేయాలి. శుక్లాష్టమి మొదలు శుక్లద్వాదశివరకు 5 రోజులు, త్రయోదశి పగలు ఒకఅహస్సు. రాత్రి ఒకఅహస్సు. అంటే త్రయోదశినాడు పూర్వాహ్ణంలో (మధ్యాహ్నానికి పూర్వం) ఒకపర్యాయం పారాయణ, హోమం చేసి, స్నానం చేసి రాత్రికి బదులుగ వెంటనే లేక కొద్దిపాటి విశ్రాంతితర్వాత మరొకసారి పారాయణ, హోమం చేయాలి. అదే విధంగా చతుర్దశినాడు కూడా పగలు ఒకఅహస్సు, రాత్రి ఒకఅహస్సుగా పరిగణించాలి. ఈవిధంగా పారాయణ చేయటంచేత నవపారాయణ లవుతాయి. ఇదే నవదుర్గావిధానం.

## కాళరాత్రివిధానం

**శ్లో॥ శుక్లాష్టమీ మవష్టభ్య నవదుర్గా విధానవత్**
**య ద్వయం క్రియతే జాప్యః కాళరాత్రి ఇ తీరితా.**

నవదుర్గావిధానం తెలిసికొని, కృష్ణాష్టమి మొదలు కృష్ణచతుర్దశివరకు గల 7 రోజులలో నవపారాయణలు చేయాలి. పారాయణ పగలే కాని రాత్రిపూట కాదు కాళరాత్రివేళ అసలే కాదు.

## ఆవృతిపారాయణవిధానం

ఒకేరోజు అనేకపారాయణలు చేయడం ఆవృతిపారాయణం అవుతుంది. కవచ, అర్గళాదిక మైన పూర్వాంగం, న్యాసం మొదటిఆవృతికి ముందు మాత్రమే చేయాలి. తర్వాత పారాయణోత్తరన్యాసం మొదలు ఉత్తరాంగం – చివరిపారాయణం తర్వాత ఒక్కపర్యాయం పఠించాలి. అంటే ప్రతిఆవృతికి ముందు వెనుకలలో ప్రతిసారి కవచాదులు, న్యాసం, వగైరాలు చేయ నక్కరలేదు.

## చండీపాఠ (నవ) భేదాలు - 2

**చరిత్రత్రయజాప్యస్య చండికాయా నృపోత్తమ,**
**సరహస్యస్య నామాని బ్రహ్మోక్తాని వదా మ్యహమ్.**
**మహావిద్యా, మహాతంత్రం, చండీ, సప్తశ, తీతి చ,**
**మృతసంజీవినీ నామ పంచమం పరికీర్తితమ్.**
**షష్ఠం చైవ మహాచండీ, సప్తమం రూపదీపికా,**
**అష్టమం తు చతుష్షష్టియోగినీ నవమీ పరా.**
**ఏవం నవానాం భేదానాం నామాని చ పృథక్ పృథక్.**

సప్తశతిలోని ప్రథమ, మధ్యమ, ఉత్తమ చరిత్రలు ఒకదానిని మొదట చెప్పి మిగిలినవాటిని తర్వాత వరస మార్చి చెప్పడంలో 3 ×2 = 6 భేదాలు. అవి వరుసగా 1. మహావిద్య, 2. మహాతంత్రం, 3. చండీ, 4. సప్తశతి, 5. మృతసంజీవని, 6. మహాచండి. రూపం దేహి అనేవాక్యమూ, యోగినీనామాలు, సౌః అనేబీజాక్షరాన్ని సంపుటీకరించడం ద్వారా, 7. రూపచండి, 8. చతుష్షష్టియోగిని, 9. పర అని మరో మూడు భేదాలు ఏర్పడుతున్నాయి. అవి ఇలా ఇవి మొత్తం తొమ్మిదిభేదాలు అయ్యాయి.

1. **మహావిద్య :** **ఆద్య,ద్వితీయ,తృతీయచరితానుక్రమేణ చ,**
**మహావిద్యా సప్తశతీ సర్వతంత్రేషు గోపితా.**
**మహావిద్యాం చ శాంత్యర్థం పఠే చ్చ సతతం నరః.**

ప్రథమ, మధ్యమ, ఉత్తమ చరిత్రలను అదే క్రమంలో (1, 2, 3) పఠిస్తే అది మహావిద్య అనబడుతుంది. దీన్ని శాంతికోసం చెప్తారు.

2. **మహాతంత్రం :** **ఆద్యంతమధ్యచరితం మహాతంత్ర మి తీరితమ్.**

ప్రథమ, ఉత్తమ, మధ్యమ(1,3,2)చరిత్రలక్రమంలో చెప్పడం మహాతంత్రం.

3. **చండి :** **మధ్యమాంతాదిచారిత్రక్రమా చ్చండీమహామనుః,**
**చండీపాఠం హి రాజేంద్ర! పుష్ట్యర్థం చ సదా జపేత్,**

మధ్యమ, ఉత్తమ, ప్రథమ (2, 3, 1) చరిత్రల క్రమంలో చెప్పడం చండి. ఇది పుష్టికోసం చెప్తారు.

4. **సప్తశతి :** **మధ్యమాద్యంతచారిత్రక్రమాత్ సప్తశ తీతి చ,**
**మోహనార్థం సప్తశతీ పాఠం భవతి సిద్ధిదమ్.**

మధ్యమ, ప్రథమ, ఉత్తమ (2, 1, 3) చరిత్రలక్రమంలో చెప్పితే, దానికి సప్తశతి అని పేరు. దీన్ని సమ్మోహనంకోసం చెప్తారు.

5. **మృతసంజీవని :** **అంత్యాదిమధ్యచారిత్రా న్మృతసంజీవినీ స్మృతా,**
**విషరోగాల్పమృత్యుఘ్నపాఠే సంజీవినీక్రమః.**

ఉత్తమ, ప్రథమ, మధ్యమ (3, 1, 2) చరిత్రలక్రమంలో చెప్పితే, అది మృతసంజీవని. విషం, రోగం మొ.వాటివల్ల కలిగేఅపమృత్యువును నివారించడానికి చెప్తారు.

6. **మహాచండి :** **అంత్యమధ్యాదిచారిత్రా, న్మహాచం డీతి కథ్యతే,**
**స్తంభనే చ మహాచండీ, సతతం సిద్ధిదాయినీ.**
**త థైవ మారణే జ్ఞేయా, మహాచండీ చ చండికా,**
**ఉచ్చాటనే చ విద్వేషే, కృత్యా శాంత్యాదికర్మణి.**

ఉత్తమ, ప్రథమ, మధ్యమ (3, 2, 1) చరిత్రలక్రమంలో చెప్పితే, అది మహాచండి. దీన్ని స్తంభన, ఉచ్చాటనాదులకు ఉపయోగిస్తారు.

7. **రూపచండి :** **రూపం దే హీతి సంయోజ్య నవార్ణమనునా సహ**

**సంపుటత్వేన సంయోజ్య ప్రతిశ్లోకం జపేత్ తథా.**
**రూపచం డీతి సా ప్రోక్తా సర్వాభీష్ట ఫలప్రదా,**
**రూపచండీ శుభకర్త్రీ.**

మొదట నవార్ణమంత్రాన్ని, దానితర్వాత **'రూపం దేహి జయం దేహి, యశో దేహి, ద్విషో జహి'** అనేవాక్యాన్ని సప్తశతిలోని ప్రతిమంత్రానికి ముందూ, చివరా, కలిపి సంపుటం చేసి చెప్తే, అది రూపచండి అవుతుంది. ఇది సమస్త మైనకోరికలను తీరుస్తుంది. శుభప్రద మైనది.

8. **చతుష్షష్టిపది :** **యోగినీనాం చతుష్షష్టియోగాత్ సప్తశతీమనోః,**
**చతుష్షష్టిపదీ ప్రోక్తా యోగసిద్ధిప్రదాయినీ.**

సప్తశతీమాలామంత్రానికి (ప్రథమాధ్యాయం) మొదటా, (త్రయోదశాధ్యాయం) చివరా చతుష్షష్టియోగినీనామాలు సంపుటం చేసి చెప్తే, అది చతుష్షష్టిపది. ఇది యోగసిద్ధిని కలిగిస్తుంది.

9. **పరాచండి :** **పరాబీజసమాయోగాత్ పరా చం డీతి కథ్యతే,**
**..... పరాచండీ చ మోక్షదా.**

**సౌః** అనే పరాబీజాక్షరాన్ని సప్తశతిలోనిప్రతిమంత్రానికి ముందూ చివరా కూర్చి చెప్తే, అది పరాచండి. ఇది మోక్షం కలిగిస్తుంది.

## 10. నవదుర్గ

**ప్రత్యేకం త్రై స్త్రిభి ర్బీజై ర్జయాదినవనామభిః,**
**జయాం చ విజయాం భద్రాం భద్రకాళీ మనంతరమ్.**
**సుముఖీం దుర్ముఖీం ప్రజ్ఞాం పశ్చాద్ వ్యాఘ్రముఖీం తథా,**
**అథ సింహముఖీం దుర్గాం నవదుర్గా విదు ర్బుధాః.**
**ఏవం జ్ఞాత్వా సప్తశతీం యో జపేత్ సుసమాహితః,**
**తస్య దేవీ సుప్రసన్నా సర్వాభీష్టప్రదా భవేత్.**

ఐం – క్లీం – సౌః అనేబీజత్రయాన్నీ 1. జయ, 2. విజయ, 3. భద్ర 4. భద్రకాళి, 5. సుముఖి, 6. దుర్ముఖి, 7. ప్రజ్ఞ, 8. వ్యాఘ్రముఖి, 9. సింహముఖి అనేతొమ్మిది నామాలూ, సప్తశతిలోని ప్రతిమంత్రానికి ముందూ చివరా సంపుటం చేసి చెప్తే, అది నవదుర్గ. ఇది దేవిని ప్రసన్నురాలిని చేసి, అన్ని కోరికలను తీరుస్తుంది.

# చండీపాఠభేదాలు - 3

రుద్రయామళంలో ఇవే భేదాలు కొంచెం తేడాతో కన్పిస్తున్నాయి.

**చరిత్రత్రయజాప్యస్య చండికాయై నరోత్తమ,**
**సరహస్యం చ నామాని బ్రహ్మోక్తాని వదామ్యహమ్.**
**మహావిద్యా మహాయంత్రం మహా సప్తశ తీతి చ,**
**మృతసంజీవనీ నామ చతుర్థం సంప్రకీర్తితః.**
**పంచమం చ మహాచండీ షష్ఠం చైవ చతుష్పదీ**
**ఏతాని యో విజానాతి నామాని నృపసత్తమ!**

ఇక్కడ మహావిద్య, మహాయంత్రం, మహాసప్తశతి, మృతసంజీవని, మహాచండి, చతుష్పది అని ఆరుభేదాలు చెప్పబడ్డాయి.

## 1. మహావిద్య (కాళీసూక్తం)

ఈసంజ్ఞలు సంఖ్యాసాంకేతికాలు. అంటే కటపయాది సంజ్ఞలను ననుసరించి సంఖ్యలను గ్రహించాలి. (1. కాది ర్నవ – క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ – ఇవి తొమ్మిది. 2. టాది ర్నవ – ట ఠ డ ఢ ణ త థ ద ధ (9) 3. పాదిః పంచ – ప ఫ బ భ మ – (5) 4. యాది ర్నవ – య ర ల వ శ ష స హ క్ష – (9) క–1 ఖ–2 గ–3 అనేవిధంగా క మొద లైనవర్ణాలనుబట్టి సంఖ్యలను స్వీకరించాలి.

విద్య – వి=4, య=1. సంయుక్తాక్షరంలో చివరిహల్లునే గ్రహించాలి. కాబట్టి 'విద్య'లో 'ద్య' లోని చివరిహల్లు 'య' ఇక్కడ గ్రహింపబడుతుంది. అంకానాం వామతో గతిః. అంకెలు ఎడమనుండి కుడికి గ్రహించాలి. కాబట్టి విద్య అంటే 14 ప్రథమాధ్యాయంలోని 54వ శ్లోకం రెండవపాదం నుంచి 68వశ్లోకం వరకు ఉన్న 14½శ్లోకాల కాళి(రాత్రి)సూక్తం **మహావిద్య**. ప్రారంభంలోనిఅర్ధశ్లోకం లెక్కలోకి తీసుకోకుండ మిగిలిన 14 శ్లోకాలు మహావిద్య అని సంఖ్యాసంకేతాన్నిబట్టి గ్రహించాలి.

## 2. మహాయంత్రం (లక్ష్మీసూక్తం)

యంత్రం – య=1, ర=2. 'త్ర' అనేసంయుక్తాక్షరంలోనిచివరిహల్లు 'ర' గ్రహింపబడుతుంది. కాబట్టి యంత్రం అంటే 21. చతుర్థాధ్యాయంలో 2వ శ్లోకం నుంచి 22వశ్లోకం వరకున్న 21 శ్లోకాల 'లక్ష్మీసూక్తం' **మహాయంత్రం** అని చెప్పబడుతున్నది.

### 3. మహాసప్తశతి

అర్గళ, కీలక, కవచాలు సప్తశతి 13 అధ్యాయాలు మొత్తం భాగం మహా సప్తశతి అని చెప్పబడుతున్నది. ఇవి మొత్తం 700 సంఖ్య కలవిగా ఒకసమన్వయం (పుట-10). 13 అధ్యాయాలభాగం సప్తశతి. అది అర్గళ, కీలక, కవచాలతో కలిస్తే మహాసప్తశతి అని స్థూలంగా చెప్పవచ్చు.

### 4. మృతసంజీవని

10వ అధ్యాయంలోని 24వశ్లోకము "తతః ప్రసన్న మఖిలం" నుండి ఆ అధ్యాయంలోని "శాంతా దిగ్జనితస్వనాః" వరకు గల 4½ శ్లోకాలభాగాన్ని **మృత సంజీవనీవిద్య** అంటారు. శుంభవధ తర్వాత అన్నిప్రాణులకు సంజీవనం అంటే మంచి ప్రాణశక్తి ఏర్పడింది కనుక ఈ 4½ శ్లోకాలభాగం మృతసంజీవనీవిద్య.

### 5. మహాచండి (దేవీసూక్తం)

చండి - చ = 6, డ = 3. కనుక చండి అంటే 36. 5వ అధ్యాయం మొదటి శ్లోకంనుంచి 36వశ్లోకంవరకు ఉన్న 36 శ్లోకాలభాగం **మహాచండి** అనబడుతున్నది. ఇందులో 7 నుండి 36 = 30 శ్లోకాలభాగానికి దేవీసూక్తం అని వ్యవహారం.

### 6. చతుష్పది

ఇంతకు పూర్వం చండీస్తోత్రచతుష్టయం (పుట-11) గా చెప్పబడిన 1. కాళీ (రాత్రి)సూక్తం, 2. లక్ష్మీ(మహిషాంతకరీ)సూక్తం, 3. సరస్వతీ(నారాయణీ)సూక్తం 4. చండీ(దేవీ)సూక్తం అనే 4 స్తోత్రాలకు కలిపి చతుష్పది అని పేరు.

## చండీపాఠభేదాలు - 4

### సృష్టి,స్థితిసంహారక్రమం

### 1. సృష్టిక్రమం (అనులోమక్రమం)

**శ్రీకామః పుత్రకామో వా, సృష్టిమార్గక్రమేణ తు,**
**సావర్ణి స్సూర్యతనయ, స్సావర్ణి ర్భవితా మనుః.**

'సావర్ణి స్సూర్యతనయః' అని మొదలుపెట్టి 'సావర్ణి ర్భవితా మనుః' అనేంత

వరకు అంటే ప్రథమాధ్యాయం మొదటి శ్లోకం నుంచి చివరి(త్రయోదశ)అధ్యాయం చివరిశ్లోకంవరకు క్రమంగా పారాయణం చేస్తే అది సృష్టిక్రమం. దీన్నే అనులోమ క్రమం అంటారు. సంపదలు, పుత్రులు మొద లైనవాటిని కోరేవారు ఈప్రకారం పారాయణం చేయాలి.

## 2. స్థితిక్రమం

**జపేచ్చక్రాది మారభ్య, శుంభదైత్యవధావధి,**
**ఆద్య మారభ్య ప్రజపేత్ పశ్చా చ్ఛేషం సమాపయేత్.**
**శాంత్యాదికామ స్సర్వత్ర స్థితిమార్గక్రమేణ తు**
**స్థితిపాఠ స్సర్వకామే** ........................

నాల్గవఅధ్యాయంనుంచి పదవఅధ్యాయం చివరివరకు మొదట చదివి, తర్వాత 1, 2, 3 అధ్యాయాలూ, ఆతర్వాత 11, 12, 13 అధ్యాయాలు చదవటం స్థితిక్రమ పారాయణం.

ఉత్తమచరిత్ర అంటే ఐదోఅధ్యాయంనుంచి 13వఅధ్యాయంవరకు మొదట చదివి, తర్వాత ప్రథమ, మధ్యమచరిత్రలు అంటే 1 నుండి 4 అధ్యాయాలు చదవటం స్థితిక్రమం అని మతాంతరం కనిపిస్తున్నది. దీన్ని గురించి పరిశీలించాలి.

శాంత్యాదులు కోరేవారు స్థితిక్రమంలో పారాయణం చేయాలి.

## 3. సంహార క్రమం (విలోమక్రమం)

.................... **(ముక్తికామే చ సంహృతిః)**
**సంహారే చాంత్య మారభ్య, పశ్చా దాదిసమాపయేత్,**
**అత్యంతాపది సంప్రాప్తే సంహార స్తు విశేషతః.**

13 అధ్యాయంలో చివరిశ్లోకం – 'ఏవం దేవ్యా వరం లబ్ధ్వా...'అనేదానితో మొదలుపెట్టి క్రమంగా చివరినుంచి మొదటికి 'సావర్ణి స్సూర్యతనయః' అనేమొదటి అధ్యాయం మొదటి శ్లోకంవరకు పఠించడం సంహారక్రమం. దీన్నే విలోమక్రమం అంటారు. పెద్దఆపదలు సంభవించినపుడూ, మోక్షంకోసమూ ఈక్రమంలో పారాయణం శ్రేష్ఠం.

ఈవిలోమక్రమంలో మరి కొన్ని భేదాలు పేర్కొంటారు.

## విలోమక్రమం - భేదాలు

**1. అధ్యాయవిలోమం :**

పారాయణంలో అధ్యాయంమాత్రమే విలోమక్రమంలో నడవటం ఒకవిధానం. అంటే 13వ అధ్యాయంలో ప్రారంభించి 12,11, 10.... అనే క్రమంలో అధ్యాయాలు మాత్రమే వెనక్కు నడుస్తాయి. ఏఅధ్యాయానికి ఆఅధ్యాయంలో శ్లోకాలు మాత్రం మొదటిశ్లోకంనుంచి చివరిశ్లోకంవరకు క్రమంగా పఠించాలి. అధ్యాయాలు మాత్రమే విలోమం కావడంవలన దీన్ని అధ్యాయవిలోమక్రమపారాయణం అనవచ్చు.

**2. శ్లోకవిలోమం :**

చివరిఅధ్యాయం చివరిశ్లోకంనుంచి మొదటిఅధ్యాయం మొదటిశ్లోకంవరకు చదవటం మరోవిధానం. ఇందులో అధ్యాయాలతోపాటు శ్లోకాలు కూడా విలోమం కావటంవల్ల ఇది శ్లోకవిలోమపారాయణం అవుతుంది. లోగడ సంహారక్రమంగా చెప్పుకొన్నవిధానం ఇదే.

**3. పదవిలోమం :**

సప్తశతిలో చివరిశ్లోకంనుండి మొదటిశ్లోకంవరకు (అర్థవంత మైన)పదాలను విలోమక్రమంలో పఠించటం పదవిలోమపారాయణం. ఈవిధానంలో అధ్యాయ శ్లోకాలతోపాటు శ్లోకంలోనిపదాలు కూడా వెనకనుండి మొదటికి వస్తాయి.

**ఉదాహరణకు :**

**మను ర్భవితా సావర్ణి స్సమాసాద్య జన్మ సూర్యాత్**
**క్షత్రియర్షభ స్సురథో లబ్ధ్వా వరం దేవ్యా ఏవమ్.**

ఇలా ప్రారంభించి శ్లోకాలు వెనక్కి చదువుతూ మొదటిశ్లోకం.

**మమ గదతో విస్తరా త్తదుత్పత్తిం నిశామయ,**
**అష్టమః కథ్యతే మనుః య స్సూర్యా త్తనయ స్సావర్ణిః.**

అని సావర్ణిపదంతో పారాయణం ముగుస్తుంది. ప్రతిశ్లోకంలోనూ పదాలు ఇలా వెనకనుంచి ముందుకు చదవాలి. ఇది కొంచెం కష్టం.

**4. అక్షరవిలోమం :**

సప్తశతిలోని చివరిశ్లోకంలో చివరిఅక్షరంతో మొదలుపెట్టి వెనక్కు మొదటి శ్లోకంమొదటిఅక్షరంవరకు చదవటం మరోవిధానం. ఇందులో అధ్యాయ, శ్లోక, పదాలతోపాటు అక్షరాలు కూడ విలోమక్రమంలో ఉంటాయి. కాబట్టి ఇది అక్షర విలోమపారాయణం అవుతుంది. ఉదాహరణకు చివరిశ్లోకం

**నుః మ తావిభర్ణిః వసా దృసామాస న్మజ్జ ర్యాసూ**

**భఃర్నయత్రిక్షథః రసు బ్ధ్వాల రంవ వ్యాదే వంఏ.**

ఇలా ప్రతిశ్లోకంలోను అక్షరాలను వెనక్కి చదువుతూ ప్రథమాధ్యాయం మొదటి శ్లోకం –

**మమ తోదగ రాద్‌స్తవి త్తింత్పదుత యమశాని**

**మఃష్ట ఉతేథ్యక నుఃమ యో యోనతర్యస్సూ ర్ణివసా**

అని పారాయణం ముగించాలి. ఇది చాలా కష్టం. వర్ణవిలోమంగా పారాయణం మరోరకంగా చేయవచ్చు. అక్షరాలే కాకుండా అందులో గుణింతాలు కూడా వెనక నుండి ముందుకు చెప్తే అది వర్ణవిలోమం అవుతుంది.

ఇటువంటివిశేష విలోమపారాయణలు నిధనం, ఉచ్చాటనం, ద్వేషం మొద లైనసందర్భాలలో ఉపయోగిస్తారు. ఈవిలోమపారాయణ తర్వాత ఆత్మరక్షణకోసం 108 సార్లు మృత్యుంజయమంత్రం జపించాలి.

## విలోమపారాయణం - విశేషఘటనం

విలోమపారాయణంలో సాధ్యనామాన్ని కూర్చి వివిధవిధాలుగా పారాయణం చేసేపద్ధతి కనిపిస్తుంది.

ఎవరిని వశం చేసుకోవాలో, లేదా చంపడం వగైరా చేయాలో, వాడు సాధ్యం. సాధ్య మైనవాడిపేరు కూర్చి, పారాయణం చేయడం ఈవిధానం.

**1. గ్రథనం :**

శ్లోకంమధ్యంలో సాధ్యనామం చేర్చటం గ్రథనం. ఇది వశ్యంకోసం.

**2. విదర్భం :**

శ్లోకానికీ శ్లోకానికీ మధ్యలో సాధ్యనామం చేర్చటం విదర్భం. ఇదీ వశ్యానికే.

**3. సంపుటం :**

సప్తశతిశ్లోకాన్ని అనులోమంగా పఠించి, తర్వాత "అముకం స్తంభయ స్తంభయ" అని తిరిగి ఆశ్లోకాన్ని అక్షరప్రతిలోమంగా పఠించటం సంపుటం. మొదట అనులోమం తర్వాత అక్షరప్రతిలోమం రెండూ కలిసి, ఒకఆవృతి అవుతుంది. ఇలా సప్తశతీగ్రంథం మొత్తం పారాయణం చేయాలి.

**4. రోధనం :**

సప్తశతిశ్లోకం సగం చదివి, "అముకాముకయో ర్విద్వేషణం కురు కురు" అనేమాటలు విలోమంగా చెప్పి, మిగిలినసగంశ్లోకాన్ని అక్షరవిలోమంగా చదవాలి. ఇదంతా ఒకఆవృతి. ఇలా సప్తశతీగ్రంథం మొత్తం పారాయణం చేయాలి.

**5. ఉచ్చాటనం :**

"అముక ముచ్చాట యోచ్చాటయ ఫట్" అనేపల్లవాన్ని ముందు చదివి, తర్వాత సప్తశతిశ్లోకం పదప్రతిలోమంగా పఠించాలి. ఇదంతా ఒకఆవృతి. ఇలా సప్తశతీగ్రంథం మొత్తం పారాయణం చేయాలి.

**6. మారణం :**

సప్తశతిశ్లోకం అక్షరప్రతిలోమంగా చదివి 'అముకం హన హన హుం ఫట్' అని చదవాలి. ఇదంతా ఒకఆవృతి. ఇలా సప్తశతీగ్రంథం మొత్తం పారాయణం చేయాలి.

ఈప్రయోగాల్లో ఏది చేసినా, పారాయణంతర్వాత శాంతికోసం "వం" అనే అమృతబీజాన్ని ముందు చేర్చి, నవార్ణమంత్రం 108 సార్లు జపించాలి. తర్వాత వడపప్పు, పానకం, నైవేద్యం పెట్టాలి. ఈవిధానాలు గురుసన్నిధానంలో చేయటం మంచిది.

# కామ్యాలు - చండీపారసంఖ్య

1. సఫలతకు : **సంకల్పపూర్వం సంపూజ్య న్య స్యాంగేషు మనూన్ సకృత్,**

**పశ్చాద్ బలిప్రదానేన ఫల మాప్నోతి మానవః.**

సంకల్పం చేసి, దేవిని పూజించి, న్యాసం చేసుకొని, సప్తశతిపారాయణం చేసి, బలిదానం చేస్తే, సప్తశతీపారాయణం ఫలితం ఇస్తుంది.

2. కష్టనివారణకు : మూడు ఆవృత్తుల చండీపారాయణం.

**ఉపసర్గోపశాంత్యర్థం త్రి రావృత్తిం పఠే న్నరః.**

3. గ్రహశాంతికి : ఐదు పర్యాయాలు.

**గ్రహోపశాంతౌ కర్తవ్యా పంచావృత్తి ర్వరాననే.**

4. భయనివృత్తికి : ఏడు సార్లు. **మహాభయే సముత్పన్నే సప్తావృత్తి ముదీరయేత్.**

5. శాంతికి : తొమ్మిది సార్లు. దీనివల్ల వాజపేయయాగఫలం కలుగుతుంది.

**నవావృత్తౌ భవే చ్ఛాంతి ర్వాజపేయఫలం లభేత్.**

6. రాజు, వశం కావటానికి, సంపదకు : పదకొండు సార్లు

**రాజవశ్యాయ భూత్యై చ రుద్రావృత్తి ముదీరయేత్.**

7. కామ్యసిద్ధికి, శత్రుహానికి : పన్నెండు సార్లు

**అర్కావృత్త్యా కామ్యసిద్ధి ర్వైరిహాని శ్చ జాయతే.**

8. శత్రు, స్త్రీ వశీకరణానికి : పధ్నాలుగు సార్లు

**మన్వావృత్త్యా రిపు ర్వశ్య స్తథా స్త్రీ వశతా మియాత్.**

9. సౌఖ్యానికి, సంపదలకూ : పదిహేను సార్లు

**సౌఖ్యం పంచదశావృత్త్యా శ్రియ మాప్నోతి మానవః.**

10. పుత్ర, పౌత్ర, ధనసిద్ధికి : పదహారు సార్లు

**కలావృత్త్యా పుత్రపౌత్రధనధాన్యాగమం విదుః.**

11. రాజభయనివృత్తికి : పదిహేడు సార్లు

**రాజభీతివినాశాయ విపక్షోచ్చాటనాయ చ, కుర్యాత్ సప్తదశావృత్తిమ్.**

12. శత్రువులఉచ్చాటనకు : పద్దెనిమిది సార్లు. **త థాష్టాదశకం ప్రియే.**

13. మహాఋణవిమోచనానికి : ఇరవై సార్లు

**మహాఋణవిమోక్షాయ వింశావృత్తిం పఠే న్నరః.**

14. బంధవిమోచనానికి : ఇరవైఐదు సార్లు

**పంచవింశావర్తనా ద్ధి భవే ద్బంధవిమోక్షణమ్.**

15. వైద్యం లేనిరోగం, జాతి, కులనాశం మొ. సంకటాలు పోవటానికి, వివిధ వృద్ధులు కలగడానికి : వందసార్లు.

**సంకటే సమనుప్రాప్తే దుశ్చికిత్స్యామయే సదా,**
**జాతిధ్వంసే కులోచ్ఛేదే ఆయుషో నాశ మాగతే.**
**వారివృద్ధౌ వ్యాధివృద్ధౌ ధననాశే తథా క్షయే,**
**త థైవ త్రివిధోత్పాతే తథా చై వాతిపాతకే.**
**కుర్యాద్ యత్నా చ్ఛతావృత్తిం తత స్సంపద్యతే శుభమ్.**
**విపద స్తస్య నశ్యంతి అంతే యాతి పరాం గతిమ్,**
**జయవృద్ధౌ శతావృత్త్యా రాజ్యవృద్ధౌ సదా పఠేత్.**

16. అనుకున్నది కావటానికి : 108 సార్లు. దీనివల్ల 100 అశ్వమేధాలఫలితం.

**మనసా చింతితం దేవి సిద్ధి రష్టోత్తరా చ్ఛతాత్,**
**శతాశ్వమేధయజ్ఞానాం ఫల మాప్నోతి సువ్రతే!**

17. లక్ష్మికీ, మోక్షానికీ : 1000 సార్లు

**సహస్రావర్తనా ల్లక్ష్మీ రావృణోతి స్వయం స్థిరా,**
**భు క్త్వాన్యథా కామం నరో మోక్ష మవాప్నుయాత్.**

18. 50 సార్లు పారాయణం చేస్తే, అన్నికోరికలు తీరుతాయి.

**పంచాశదావృత్తిపాఠాత్ సర్వా, స్సిద్ధ్యంతి సిద్ధయః.**

## సంపుటప్రయోగాలు

సంపుటాదులస్వరూపం గురించి సంగ్రహంగా ముందు తెలుసుకుందాం.

### 1. పల్లవ, యోజన, సంపుటాలు :

**యోజనం :** ఏ దైనా విశిష్టాంశాన్ని అనుష్ఠించేమంత్రానికి ముందు మాత్రమే ప్రయోగించడం యోజనం అంటారు.

**పల్లవం :** చివర మాత్రమే చేర్చి ప్రయోగించడం పల్లవం.

**సంపుటం :** ముందూ, వెనకా రెండు వైపులా చేర్చి చెప్పడం సంపుటం.

**సంపుటం ద్వివిధం జ్ఞేయ, ముదయాస్తకరం ప్రియే!**

ఈసంపుటం ఉదయకరం, అస్తకరం అని రెండురకాలు.

**ఉదయకరం :** **మంత్ర మాదౌ, పునః శ్లోక, మంతే మంత్రం పునః పఠేత్.**
**పున ర్మంత్రం పునః శ్లోకం క్రమో ఽయ ముదయే శుభః.**
**ఉదయోత్కర్షలాభాయ సంపుటో ఽ యు ముదాహృతః.**

సంపుటం చేయవలసినమంత్రం, తర్వాత సప్తశతి(శ్లోకం)మంత్రం, చివరికి మళ్ళీ సంపుటమంత్రం సంపుటం చేయడం ఉదయకరం. ఇది వృద్ధ్యాదిసాధకం. దీనికి శాంతి, పుష్టి, వశీకరణాదుల్లో ఉపయోగం.

**అస్తంకరం :** **మంత్ర మాదౌ పునః శ్లోక, మంతే మంత్రా విపర్యయాః,**
**పున ర్మంత్రం పునః శ్లోకం, పున ర్మంత్రవిపర్యయమ్**
**మారణోచ్చాటనే బంధే, సంపుటో ఽ యు ముదాహృతః.**

మొదట సంపుటం చేసేమంత్రం, తర్వాత సప్తశతి(శ్లోకం)మంత్రం, ఆతర్వాత మళ్ళీ సంపుటం చేసేమంత్రం, తర్వాత మళ్ళీసంపుటమంత్రం, తర్వాత సప్తశతిశ్లోకం ఆతర్వాత సంపుటమంత్రం విపర్యయంగా (తిరగవేసి) చెప్పడం అస్తంకరం అనేసంపుట విధానం. ఇది, మారకం ఉచ్చాటనం, బంధనం మొ. వాటికి ఉపయోగించేది.

## కాత్యాయనీతంత్రోక్తసంపుటాలు

1. **మంత్రసిద్ధికి :** సప్తశతిలోనిప్రతిమంత్రానికి మొదట, చివర "ఓం" చెప్పాలి. ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం అనే సప్తవ్యాహృతులతో గాయత్రిని చెప్పాలి.

2. **అతిశీఘ్రసిద్ధికి :** ప్రతిమంత్రానికి మొదట 'ఓం భూ ర్భువ స్సువః' అని చివర 'సువ ర్భువ ర్భూ రోమ్' అనీ కలిపి 100 ఆవృతులు పఠించాలి.

3. **సర్వకామసిద్ధికి, ఆపన్నివారణకు :**

1. **సర్వత్ర సంపుటీకృత్య జాతవేదస ఇత్యృచా,**
**శతపాఠా న్మహేశాని! సర్వాన్ కామా నవాప్నుయాత్.**

**జాతవేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతి వేదః**

**స నః పర్ష దతి దుర్గాణి విశ్వా నా వేవ సింధుం దురితా త్యగ్నిః.**

అనేమంత్రం సంపుటం చేసి, లేదా మొదట మాత్రం చేర్చి, 100 సార్లు పారాయణం చేయాలి. లేదా మొదట, చివర 108 సార్లు జపం చేయాలి.

**2. భగవత్యా కృతం సర్వ మిత్యాది ద్వాదశోత్తరః,**
**శతాక్షరో మహామంత్రో లక్ష మావర్తయేద్ వ్రతీ,**
**సర్వేకామా శ్చ, సిద్ధ్యంతి సర్వాపత్తినివారణమ్.**

112 అక్షరాలఈమంత్రం సంపుటిచేసి చెప్పాలి.

**3. దేవి! ప్రసన్నార్తి మంత్రం పూర్వవ త్పరికీర్తితమ్,**

దేవి! ప్రసన్నార్తిహరే! (11–3) అనేశ్లోకం లక్ష, పదివేలు, వేయి, లేదా 108 జపం. లేదా ప్రతిమంత్రం దీనితో సంపుటం చేసి చెప్పాలి.

4. హినస్తి దైత్యతేజాంసి (11.27) లక్ష, పదివేలు, వేయి జపం. ఆపన్నివృత్తికి

5. ప్రతిశ్లోకాన్ని క్లీం బీజసంపుటం చేసి, 41 రోజులు 3 ఆవృతులుగా పఠించాలి.

**4. అపమృత్యునివారణకు :** **త్రియంబకం మహామంత్రం, సంపుటం శతజాపనాత్**
**అపమృత్యుం హరే దాశు, సాధకో నాత్ర సంశయః.**

1. **త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్**
   **ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ, మా ౭ మృతాత్.**
   అనే మృత్యుంజయమంత్రం 108 సార్లు జపించాలి.
2. లేదా సప్తశతిలో ప్రతిమంత్రానికి ముందు పై మృత్యుంజయమంత్రాన్ని చెప్పాలి. లేదా మృత్యుంజయబీజాలు అనులోమవిలోమం సంపుటంగా 100 ఆవృతులు.

**5. సర్వకార్యసిద్ధికి – శరణాగతదీనార్తమంత్రస్య సంపుటా చ్ఛివే.**

**శరణాగతదీనార్త** : (11–11) శ్లోకం సంపుటం.

**6. విపత్తినాశపూర్వకశుభప్రాప్తికి, సర్వకామసిద్ధికి :**

**కరోతు సా న ఇత్యాదిపాదసంపుటజాపనాత్.**

**కరోతు సా న శ్శుభహేతు రీశ్వరీ, శుభాని భద్రా ణ్యభిహంతు చాపదః.**

(5–35) సంపుటం.

**7. ఇష్ట మైనవరం కలగటానికి : ఏవం దేవ్యా వరం లబ్ధ్వా మంత్రసంపుటితేన వై,**
**సర్వకామాప్తి రి త్యుక్తం శ్రీచిదంబరమూర్తినా.**

**ఏవం దేవ్యా వరం లబ్ధ్వా** (13–17) **భవితా మనుః** అనేశ్లోకం సప్తశతి ప్రతిమంత్రానికి ముందూ, వెనుక సంపుటం చేసి చెప్పాలి. లేదా కామబీజసంపుటంతో రోజుకు 3 ఆవృతుల చొప్పున 41 రోజులు.

**8. దారిద్ర్యాదిసమస్తఆపదలనివారణకు :**

**దుర్గే స్మృ తేతి మంత్రేణ, సంపుటీకృత్య పార్వతి,**
**భవే దత్ర న సందేహ, స్సర్వాపత్తినివారణమ్.**
**శతవారజపే నైవ లక్షమంత్రజపేన వై.**

1. దుర్గే స్మృతా హరసి (4–17) అనేశ్లోకం సంపుటం. 2. ఈఒక్కశ్లోకాన్నే కార్యస్థితినిబట్టి లక్ష, పదివేలు, వేయి 108 సార్లు జపించినా చాలు.

3. **దుర్గే స్మృ తేతి మంత్ర స్తు ద్విధాకృత్య మహేశ్వరి!**
**ఆద్య మర్ధం సముచ్చార్య యదంతి య చ్చ దూరకే.**
**ఋచాంతే తూత్తరార్ధం తు యోజయిత్వా ప్రయత్నతః,**
**లక్షసంఖ్యాజపే నైవ సర్వాపత్తినివారణమ్.**

దుర్గే స్మృతా హరసి (4–17) అనేశ్లోకం సగం కలిపి, దానితర్వాత 'తతో యదంతి య చ్చ దూరకే' అనేమంత్రం, దానికి తర్వాత 'దారిద్ర్యదుఃఖశమనం' అనే(4–17)శ్లోకం ఉత్తరార్థం సగం కలిపి, కార్యానుసారంగా లక్ష, పదివేలు, వేయి 108 సార్లు జపించినా చాలు. (పుట–53)

**9. సర్వబాధాశాంతికి : సర్వబాధాప్రశమనం సంపుట్యా శతవారకమ్**
**పఠనాద్ వైరినాశ స్స్యాత్, తథా లక్షజపా దపి.**
**సహస్ర మథవా జప్త్వా, కార్యలాఘవగౌరవాత్.**

సర్వబాధాప్రశమనం (11–39) అనేశ్లోకం లక్షజపం. లేదా ఈశ్లోకం సంపుటంతో 100 సార్లు. లేదా సర్వబాధావినిర్ముక్తో... న సంశయః (12–12) అనేశ్లోకం సంపుటం.

**10. మహామారీనివారణకు : ఇత్థం యదా యదా బాధా సంపుట్యా శతజాపనాత్,**
**మారీశాంతి ర్భవేత్ క్షిప్రం నాత్ర కార్యా విచారణా.**

ఇత్థం యదా యదా బాధా(11–50)అనేశ్లోకం లక్షజపం. లేదా సంపుటంగా

100 ఆవృతులు. జయంతీ మంగళా ... స్వధా నమో ఽ స్తు తే' (అర్గళం-1)

**11. స్వారాజ్యసిద్ధికి :** తతో వవ్రే నృపో (13-11) అనేశ్లోకం లక్ష జపం లేదా సంపుటం.

**12. బాలగ్రహశాంతి :** **హినస్తి దైత్యతేజాంసి మంత్రం లక్షం తథాయుతమ్.**
**ఘంటాం కాంస్యమయీం బధ్వా మాషభక్తం బలిం చరేత్**
**మంత్ర ముచ్చార్య తద్ఘంటానాదం కుర్యా ద్విచక్షణః**
**తన్నాదశ్రవణా ద్దేవి పలాయంతే పిశాచకాః ॥**

హినస్తి దైత్యతేజాంసి (11-27) అనేశ్లోకం సంపుటం. సదీపబలిదానం, ఘంటావాదనం. లేదా పైశ్లోకం లక్షజపం.

**13. శీఘ్రకార్యసిద్ధికి :** 1. ఒకసారి మొదటిఅధ్యాయం మొదటిశ్లోకంనుంచి చివరి అధ్యాయం చివరిశ్లోకంవరకు అనులోమపారాయణం. 2. చివరిఅధ్యాయం చివరి శ్లోకంనుంచి మొదటిఅధ్యాయం మొదటిశ్లోకంవరకు ఒకసారి విలోమపారాయణం. 3. మళ్ళీ మొదటిలాగా అనులోమపారాయణం.

**14. లక్ష్మీప్రాప్తికి :** **కాంసో స్మి తా మృచం దేవి సంపుటీకరణా న్నరః**
**లక్ష్మీవాన్ జాయతే సద్య శ్శతపాఠా న్న సంశయః.**

కాంసో స్మితాం అనేశ్రీసూక్తఋక్కును సంపుటం చేసి, సప్తశతి పారాయణం. 10 ఆవృతులు చేయా లని చిదంబరసంహిత.

**దినా న్యేకోనపంచాశద్ రమాబీజేన సంపుటమ్,**
**నిత్యం పంచదశావృత్తౌ లక్ష్మీవాన్ భవతి ధ్రువమ్.**

లేదా క్లీం బీజం సంపుటం చేసి 49 రోజులు, రోజుకు 15 సార్లు పారాయణ.

**15. ఋణపరిహారానికి :** అనృణా అస్మిన్ .... అనేమంత్రం సంపుటం.

**16. మారణానికి :** ఏవ ముక్త్వా సముత్పత్య (3-37) అనేమంత్రం సంపుటం.

**17. మోహనం :** **జ్ఞానినా మపి చేతాంసి మంత్రసంపుటితేన వై,**
**శతపాఠాద్ రాజపత్న్యో మోహ మేష్యంతి నాన్యథా.**

1. జ్ఞానినా మపి చేతాంసి (1-42) అనేశ్లోకం లక్షజపం.

2. ప్రతిమంత్రాన్ని ఆమంత్రపు శ్లోకంతో సంపుటం చేసి 100 పారాయణలు చేస్తే, తప్పక మోహనం జరుగుతుంది.

**18. రోగనాశనానికి :** **రోగా నశేషమంత్రం తు సంపుటం విధినా చరేత్,**
**శతవారం మహారోగనాశనం భవతి ధ్రువమ్.**
**మంత్రలక్షజపే నైవ రోగనాశో భవేద్ ధ్రువమ్.**

రోగా నశేషా నపహంసి..... ప్రయాంతి (11-26) అనేశ్లోకం సంపుటం. లేదా ఈశ్లోకం ఒకటి లక్షజపం.

**19. సకలవిద్యాప్రాప్తికి, మాటలోపం పోవటానికి :**

**ఇ త్యుక్త్వా సా తదా దేవీమంత్రసంపుటజాపనాత్**
**వాగ్బీజసంపుటే నాపి విద్యావాన్ శతపాఠతః.**
**తన్మంత్రలక్షజాపనా త్త దేవ హి ఫలం శివే.**

ఇ త్యుక్త్వా సా తదా దేవీ (5-66) అనేశ్లోకం సంపుటం. లేదా ఐం అనేవాగ్బీజం సంపుటం. (తో 100 సా ర్లని మృత్యుంజయసంహిత) 'విద్యా స్సమస్తా స్తవ దేవి'(11 5) అనేశ్లోకం సంపుటం. 'మే ధాసి' అనేశ్లోకం సంపుటం.

**20. వశీకరణం : ఏకవింశ ద్దినం దేవి కామబీజేన సంపుటమ్,**
**ప్రత్యహం తు దశావృత్త్యా రాజవశ్యం భవేద్ ధ్రువమ్.**

కామబీజసంపుటంతో 21 రోజులు, రోజుకు 10 ఆవృతులు చేయాలి. 12 సార్లు అని చిదంబరసంహిత.

**21. ఉచ్చాటనం : మాయాబీజపుటం కృత్వా ఫట్ పల్లవసమన్వితమ్.**

'హ్రీం' బీజసంపుటంతో 'ఫట్' అనేది పల్లవంగా చివర మాత్రం చెప్పి 7 రోజులు, రోజుకు 13 సార్లు చెప్తే ఉచ్చాటనం అవుతుంది.

**22. సర్వోపద్రవనాశం :** పైవిధంగా 4 రోజులు. రోజుకు 11 సార్లు చెప్పాలి. రక్షాంసి య త్రోగ్రవిషా శ్చ.... పరిపాసి విశ్వం (11-31) అనేశ్లోకం సంపుటం.

**23. సర్వకార్యసిద్ధి : నిత్యం త్రివారా దేవం హి చత్వారింశద్దినం శివే.**
**ఏకాధికం కార్యసిద్ధి ర్భవే దత్ర న సంశయః.**

పైవిధంగా 40 రోజులు. 3 సార్లుగా ప్రారంభించి, రోజు కొకటి చొప్పున అధికపర్యాయాలు చెప్పాలి. అంటే మొదటిరోజు 3 సార్లు, రెండవరోజు 4 సార్లు, మూడవరోజు 5 సార్లు అనేవిధంగా పెంచుతూ పారాయణం చేయాలి. దానివలన సమస్త మైనకార్యాలు నెరవేరుతాయి.

## మరి కొన్ని సంపుటవిశేషాలు

1. **సామూహికకల్యాణమునకు :**
   దేవ్యా యయా తత మిదం ..... శుభాని సా నః. (4అ.3శ్లో)
2. **విశ్వరక్షణమునకు :** యా శ్రీః స్వయం సుకృతినాం .... దేవి, విశ్వమ్.(4-7)
3. **విశ్వాభ్యుదయమునకు :**విశ్వేశ్వరి! త్వం పరిపాసి......... భక్తినమ్రాః.(11-33)
4. **విశ్వవ్యాప్త మైనవిపత్తు తొలగుటకు :**
   దేవి ప్రసన్నార్తిహరే....... చరాచరస్య. (11-3)
5. **విశ్వముయొక్క భయాశుభనాశమునకు :**
   యస్యాః ప్రభావ మతులం........... మతిం కరోతు. (4-5)
6. **విశ్వముయొక్క పాపతాపనివారణమునకు :**
   దేవి ప్రసీద పరిపాలయ......... మహోపసర్గాన్. (11-34)
7. **విపత్తు నివారణ యగుటకు, సర్వకార్యసిద్ధికి :**
   శరణాగతదీనార్త ........ నమో ఽస్తు తే. (11-12)
8. **భయహరణమునకు :**
   (క) సర్వస్వరూపే సర్వేశే ........ నమో ఽస్తు తే. (11-24)
   (చ) ఏత త్తే వదనం సౌమ్యం........ నమో ఽస్తు తే. (11-25)
   (ట) జ్వాలాకరాళ మత్యుగ్ర ........ నమో ఽస్తు తే. (11-24)
9. **పాపనాశమునకు :** హినస్తి దైత్యతేజాంసి ............ సుతా నివ.(11-27)
   నతేభ్య స్సర్వదా ........ రూపం దేహి. (అర్గళం.7)
10. **ఆరోగ్యసౌభాగ్యప్రాప్తికి :**
    దేహి సౌభాగ్య మారోగ్యం దేహి మే పరమం సుఖమ్
    రూపం దేహి ........ ద్విషో జహి (అర్గళం.10)
11. **సులక్షణపత్నీప్రాప్తికి :** పత్నీం మనోరమాం దేహి మనోవృత్తానుసారిణీమ్,
    తారిణీం దుర్గసంసారసాగరస్య కులోద్భవామ్.(అర్గళం.22)
12. **సర్వవిధాభ్యుదయప్రాప్తికి :** తే సమ్మతా జనపదేషు ... భవతీ ప్రసన్నా.(4-15)

13. **రక్షణము పొందుటకు :** శూలేన పాహి నో ........ నిస్స్వనేన చ.(4-24)
14. **సమస్తకల్యాణప్రాప్తికి :** సర్వమంగళమాంగల్యే .... నమో ఽస్తు తే.(11-10)
15. **శక్తిప్రాప్తికి :** సృష్టిస్థితివినాశానాం .......నమో ఽస్తు తే. (11-11)
16. **ప్రసన్నతకు :** ప్రణతానాం ప్రసీద త్వం ......... వరదా భవ.(11-35)
17. **భుక్తిముక్తిప్రాప్తికి :** విధేహి దేవి, కల్యాణం విధేహి విపులాం శ్రియమ్,
రూపం దేహి........ ద్విషో జహి. (అర్గళం.12)
18. **స్వర్గముక్తిప్రాప్తికి :** (అ) సర్వభూతా యదా దేవి ..... మోక్తయః. (11-7)
(ఆ) సర్వస్య బుద్ధిరూపేణ .........నమో ఽస్తు తే.(11-9)
19. **స్వప్నసిద్ధి :** దుర్గే! దేవి! నమ స్తుభ్యం సర్వకామార్థసాధకే!
మమ సిద్ధి మసిద్ధిం వా స్వప్నే సర్వం ప్రదర్శయ.
20. **ముక్తికి :** త్వం వైష్ణవీశక్తి రనంత.......ముక్తిహేతుః. (11-5)
21. **దుస్స్వప్నపరిహారానికి, శాంతికర్మలలో :** నిర్భయః పుమాన్ సంపుటి.
22. **పరప్రయోగశాంతికి :** తతో నిశుంభః - తథా. (9-30)
23. **పుత్రప్రాప్తికి :** స్మరన్ మ మైతచ్చరితం (12-28),
క్లీం సంపుటంతో 41 రోజులు, 41 పారాయణలు.
24. **ఆపద్ద్వేషనాశనం :**
త యాస్మాకం .......... పరమాపదః - సంపుటం
25. **మహాఫలం :**
ప్రతిశ్లోకానికి ఓం భూ ర్భువ స్సువః అనేవ్యాహృతిత్రయంతో గాయత్రీమంత్ర సంపుటం.

## కొన్ని సంపుటితమంత్రాలు

ఆయాకామ్యాలనుబట్టి ఆయాచరిత్రలలోని ఏ దైనా ఒకమంత్రం ఉపాసించేటప్పుడు, ఆయామంత్రాలతో కూడినఆయాచరిత్రలలోని ఆయాదేవతలను పూజించి, ఆయాచరిత్రలలోని స్తోత్రంతో గానీ, 1. విశ్వేశ్వరీం, 2. శక్రాదయ స్సురగణాః 3. దేవి ప్రసన్నార్తిహరే మొద లైనవాటితో కాని, లేదా నమో దేవ్యై అనేశ్లోకంతో కాని, ఆయాదేవతలను స్తుతించి, ఆయామంత్రాలను జపించడం క్రమం.

